శ్రీమాత్రేనమః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీరామసుధాతరంగిణి

కావ్యకళాకృషీవల, మధురకవి, పద్మకవి,

అగస్త్యరాజు సర్వేశ్వరరావు, ఎం.ఏ.,

ప్రథమ ముద్రణము – సెప్టెంబర్ 1988

ప్రతులు – 1000

ప్రాప్తిస్థానము :

1. శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు, యం.ఏ.,
రిటైర్డు ప్రిన్సిపాల్,
బ్రిడ్జిరోడ్, అద్దంకి – 523 201
ప్రకాశం జిల్లా.

లేక

2. శ్రీ పి. వీరాంజనేయులు, యం.ఏ.,
అనంతకృష్ణ నిలయం,
(లక్ష్మీనగర్), బాలాజీనగర్,
నెల్లూరు.

మూల్యము రూ. **10-00** లు

ముద్రణ :
సాయి ప్రింటింగ్ ప్రెస్,
10/514 ఆంధ్రరత్న రోడ్,
పేరాల – 523 157
చీరాల – ప్రకాశం జిల్లా



అభిరామ గుణాకర దాశరథే
జగదేక ధనుర్ధర ధీరమతే
రఘు నాయక రామ రమేశ విభో
వరదోభవ దేవ దయాజలధే॥

ఈ పుస్తకము
"ధార్మిక గ్రంథముల ముద్రణకు తోడ్పాటు"
ప్రణాళిక ననుసరించి,
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయంతో
ప్రకటింపబడినది.

# విషయసూచిక

కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు
రాజమహేంద్రవరము.

# భూమిక

శ్రీరామ సుధాతరంగిణి నా యంతరంగము నానందతరంగితమొనర్చినది. శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరవుగారు సత్కవులు. కావ్యకళాకృషీవలులు. రవీంద్రుని గీతాంజలికి వీరు కావించిన ఆంధ్రానువాదము, మఱికొన్ని పద్యకృతులు మంచిపేరు తెచ్చుకొన్నవి. ఈ తరంగిణి శ్రీరామగాథా తత్త్వగర్భితమైన కృతి. శ్రుతిరసాయనమై సురుచిరశైలీరమణీయమైన సర్వేశ్వరరావుగారి తెలుగు పద్యము ఆలోచనామృతము, అనుభవోద్గతము నైనది.

అర్చన, ఆముఖము, అనుతాపము, సుధాస్నానము, అవభృథము అను శీర్షికలుగల యీ కృతిలోని శతకాధిక పద్యములు వేదవేద్యమైన రామతత్త్వమును యథామతి వ్యాఖ్యానించుచు, రామాయణగాథామాధుర్యమును క్రమరీతిలోఁ జవిచూపుచున్నవి. కవిత్వమునందును, జీవితమునందును, కమియబండిన 'కవి' యగుటచే సర్వేశ్వరరావుగారి ప్రతిపద్యము తత్త్వానుభవసౌరభమును చిమ్ముచుండును.

తొలుత 'ఆముఖము' భారతీయవేదాంతస్వరూపమునకుఁ బాటి ముకురము వంటిది. కవిగారి బహుముఖీన తత్త్వగ్రంథ పరిశీలనా పాటవమునకు స్ఫోరకము.

ఉ॥ నీదగు సృష్టికామన ధ్వనింపని స్పందనరూపశబ్దమై
యాదిమహేతువై యచలమౌ శివతత్త్వవినిర్గతాంశమై
ప్రోదియొనర్పఁ దత్ప్రణవమూలసరస్వతి శబ్దమర్థమై
పొదుకొనంగ సృష్టియు నుపాధులఁ గల్గదె కారణాదులన్.

వేదాంతప్రతిపాదకములైన యిట్టి పద్యములు కొన్ని గ్రంథారంభమునందున్నవి. అవి వస్తుతః సాధారణపఠితకు దుర్బోధము లని

పించవచ్చును. కాని, కొంత ఓపికపట్టి చూచినచో, ఆలోచన సారవంతము అనిపించును.

'అనుతాపము' మొదలుకొని యున్న గ్రంథమంతయు స్ఫూహణీయమైన శైలిలో భావబంధురమై యున్నది. ఈ కవివరుని మోక్షకాంక్ష ప్రగాఢమై అద్వైతసిద్ధాంతమునెడల నీయన మొగ్గుదలను ప్రవ్యక్తము చేయుచున్న రచన యిది. ఆయాదర్శనములకుఁ జెందిన బహువిషయముల యభిజ్ఞత, ఉపనిషత్పరిజ్ఞానము, కవికుండవచ్చును.

"యద్వేదాధ్యయనం తదోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే,
యత్రౌఢిత్వ ముదారతాచ వచసాం యచ్చార్థతో గౌరవం
తచ్చే దస్తి తత స్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః"

అని భవభూతి చెప్పినటులు, తెలుఁగుపద్యముయొక్క నిసర్గసౌందర్యమునకు భంజకముకాని పాండిత్యము సర్వేశ్వరరావుగారిది.

ఉ. వ్యర్థముచేసికొంటి విషయార్థములం దొకజన్మకాల మి
ట్లర్థములేని నా బ్రదుకునం దిపుడొక్కమరిచి జాలిమై
సార్థముగా స్ఫురించి పరమార్థము నీవని చూప, నేఁడు ని
న్నర్థి నుతింతు నీలజలదాంతర విద్యుదలేఖ్యభాస్వరా!

పరమార్థము గ్రహింపక పుట్టువులన్నియు రిత్తచేసికొంటినన్న యనుతాపముగల యీకవి జీవనపథమున శ్రీరామచంద్రుని దయ వేయి వెన్నెలలు గాసెను. "మతముల్ మార్గములడ్డువచ్చి నిను సంభావింపలేకున్న నామతిలో నిల్వుము దివ్యరాగమయి రామా!" అని కోరిన యీకవివరుని యనురక్త హృదయము శ్రీరామచంద్రునకు సమ్మతముకాకుండదు. "నిగమాంత ప్రతిపాది తాత్మగుణ సందీప్త ప్రపంచోదయా!" వంటి సంబోధనములు సాభిప్రాయములుగా సరసముగా నుపయోగింపబడినవి.

'సుధాస్నానము' శీర్షికనుండి సహృదయ పాఠకుడు రామగాథాసుధలో అభిషిక్తుఁడగును. రామాయణ కథను తనలో లీనము చేసి

కొన్నారు సర్వేశ్వరరావుగారు. ఆత్మజ్ఞానమునకు హేతువు పరమేశ్వరానుగ్రహము. అసుర భావ పరాఙ్ముఖమైన తన మనస్సునకు ఆత్మపదవీస్థితిని గూర్పుమని కోరుటతో ఈ 'సుధాస్నానము' ఆరంభమగును. పస్తుతః పుట్టుకతోఁ బనిలేని రామచంద్రుఁడు మానవుఁ డయ్యె ననఁగా, నది మనలను సముద్ధరించుటకే. అందుకే ఈ కవిగారు "అస్మన్మన స్సాకేతంబున జన్మమందు మాధవా! జ్ఞాన ప్రరోహంబవై" అనుచున్నారు. రామగాథతోఁ దాదాత్మ్యము నందిన యీ పద్యములు గంభీరార్థ బంధురములై యానందము గొల్పుచున్నవి.

చ॥ మునులను బల్కరించుచు నపూర్వ మనోహర కాననంబ నీ
యునికిగఁ జిత్రకూటమున నుండవొ సజ్జనరక్షణార్థమై
మనమున సాధుభావముల మన్నన సేయుచు వచ్చినాడు జీ
వన వనమందుఁ బర్ణకుటి వైచి వసింపుము నాయెడందలో॥

ఇట్లే అహల్య, కబంధుఁడు, జటాయువు, సంపాతి, వాలి, ఇత్యాది పాత్రలకు సంబంధించిన గాథలు వచ్చినపుడు ఈ కవిగారు భావించిన ఆత్మపరమైన భావన, అర్థ సమన్వయము మిక్కిలి హృదయంగమములు.

ప్రతి పద్యమున నేదో విశేషము కనఁబడును.

శ్రీరామసుధాతరంగిణిని గూర్చి ఎంతేని వ్రాయవలసియున్నది. గ్రంథకర్తయే పద్యములకు తాత్పర్య విశేష వివరణము నిచ్చి పాఠకునకు మేలుచేసినారు. మఱి, నా పని సిద్ధసాధనము. ఈ కృతిని విజ్ఞులు సహృదయులు స్వయముగా చదువుకొని యానందింతురు. శ్రీ సర్వేశ్వరరావుగారితోపాటు శ్రీరామచంద్రుని దర్శించుకొందము.

ఈవును లేఁత నవ్వు లొలికించుచు నిల్తువు; నీదృగంత సం
ప్లావిత భావసౌరభము పద్యగుళుచ్ఛములన్ ఫలింపఁ ద
ద్భావ విలీనతం దవిలి పల్కుల తల్పులు మూసి, చూచెదం
దావక మోహనాకృతి నితాంతము నా హృదయాంతరంబునన్॥

లలితానగర్
రాజమహేంద్రవరము-౨ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని, *M.A. (Hons), Ph.D.*,
హైదరాబాదు

కావ్యకళాకృషీవల, మధురకవి, సత్కవి ప్రభృతి సార్థక బిరుదాంకితులగు శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావుగారు రచించిన శ్రీరామసుధాతరంగిణి చదివి అమందానందభరితుడనైతిని. గ్రంథము పరిమాణమున చిన్నదైనను, అత్యంత గంభీర భావగర్భితమై యున్నది. మనము రామాయణము కథకొఱకై, నీతి ధర్మ పరిజ్ఞానముకొఱకై, రసానంద ప్రాప్తికొఱకై చదువుదుము. కాని నిశితముగ పరిశీలింప నందు పాఠకులకు మోక్షమార్గమును చూపు తాత్త్విక విషయములెన్నో యున్నవను విషయము తెల్లమగును. ప్రతిసన్నివేశమును అంతరార్థబంధురమై ఉపనిషద్రహస్యములను వెల్లడించును. రామాయణమునందలి పాత్రలు కేవల వ్యక్తులు కారు. వారు సృష్టిరహస్యమును వెల్లడించు తాత్త్విక భావములకు ప్రతిబింబములు.

కవిగారు భక్తపుంగవులగుటయేగాక ఉపనిషదాది వేదాంత గ్రంథములన్నియు చదివి యందలి పరమార్థము నవగాహనము చేసికొన్నవారు. వారు పద్యములకు వ్రాసిన వివరణము పఠించినచో నీ విషయము వ్యక్తమగును. శ్రీరాముడు పురుషుడు, సీత ప్రకృతి, సముద్రము సంసారము, సీతాన్వేషణము తత్త్వాన్వేషణము, అనుదృష్టితో చదివినచో నీకావ్యమునందలి అపూర్వగాంభీర్యము తెలియవచ్చును. కవిగారు వివరణము కూడ వ్రాసి పాఠకులు కావ్యము నవగాహనము చేసికొనుటకు మార్గము చూపినారు. అవిద్యోపహతులగు జీవుల నుద్ధరించుటకే భగవంతు డవతారము లెత్తుచుండును. మానవులపై నతనికిగల కరుణ అపారము. ఆ కరుణచే నతడు చేయు త్యాగము వర్ణనాతీతము.

కవిగారు కర్మజ్ఞానముల విషయము కూడ స్పృశించినను, భక్తికే అందును ఆత్మనివేదనమునకే ప్రాధాన్యము నొసంగిరి. ఆత్మనివేదనము నవవిధభక్తులలో నొకటిగా చెప్పబడినను, జ్ఞానికాని ఆత్మార్పణము చేయజాలడు. భగవంతుడు గీతాచరమ శ్లోకమున చెప్పిన విషయముకూడ

నిదియే. కవిగారు భార్యావియోగము పొందిన తరువాత వైరాగ్య సంపన్నులై ఆమె స్మృత్యర్థ మీ కావ్యమును రచించిరి. ఇందు కథతోపాటు పరతత్త్వ ప్రతిపాదనముకూడ కావించుట అత్యద్భుతముగ నున్నది. అర్చన, ఆముఖము, అనుతాపము, సుధాస్నానము, అవభృథము అను విభజనకూడ సముచితముగా నున్నది.

కవిగారు పద్యరచనలో సిద్ధహస్తులు. ఇందలి పద్యములు తత్త్వగర్భితములయిన శ్రీ సీతారామాంజనేయసంవాదము నందలి పద్యములవలె ధారాశుద్ధిశోభితములునై సరళములై హృద్యములుగా నున్నవి. పలువురు వచనకవితావర్తములో పడి కొట్టుకొనిపోవు నీ కాలమున హృద్యానవద్యములైన పద్యములను - అందును తత్త్వపరిమళసువాసితములను రచించి ఆంధ్రసరస్వతి కభినవాలంకృతి నందించిన కవిగారి నభినందించుచు వారి కవితాసరస్వతికి కైమోడ్పు లర్పించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని
7-8-86

---

ప్రొఫెసర్ యస్వీ జోగారావుగారు, M.A., Ph.D., తెలుగుశాఖ
జాతీయాచార్యులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము-వాల్తేరు.

## సహృదయభూమిక

ఆంధ్రమున ఇప్పటికే రామకథాసుధాకలశములు కావ్యనాటకాది కృతులు కోకొల్లలు. "మఱల నిదేల?" యను ప్రశ్న రావచ్చును. "రాఘ

వేశ్వరు చారిత్రము నెంద రెన్నిగతులన్ వ్రాకుచ్చినం గ్రాలదే"? అని పరమభావుక పట్టభద్రుడు మహాకవి కంకంటి పాపరాజు వేసిన ప్రశ్నయే దానికి సమాధానము.

అంతేవాసిని ఉన్న స్థితినుండి ఉన్నత స్థితికి గొనిపోవు ఉదాత్తోపదేశము చేయగల చేవగలవాడే ఉత్తమ దేశికుడు. అట్టివారిలో గట్టివారు శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావుగారు. ఆ సుకృతి ఆధ్యాత్మిక భావభాష్యముగా రామకథ కెసగించిన దివ్యాకృతి ఈ కృతి. రామచంద్రుని గురుదేవులయిన వశిష్ఠ విశ్వామిత్రుల (జ్ఞానవాశిష్ఠము-అధ్యాత్మ రామాయణముల) భావధారాధోరణులతో బంధుర బాంధవము నెఱప గలట్టిడి. పరిమితిలో కడు చిన్నదయ్యును భావపరిణతిలో మిక్కిలి మిన్నది. వివరించుటకు నాకు శక్తియును చాలదు, సమయమును చాలదు. యథార్థమున కింతటి పరమార్థమహితమైనకృతికి ఆముఖము సంతరించునంతటి అధికారము నాకీ జన్మకు లేదు. పెద్దవారు పేరాసతో దూరపుకొండలు నునుపన్న సామెతగా నా పేరంతో యింతో విని పుస్తకము పంపించినారు. వ్రాయను, వ్రాయలేను అనక, అనలేక తగుదునమ్మాయని ఏవో రెండు మూడు ముడిముక్కలు వ్రాయుటకు తయారైతిని. కాని నిక్కముగా ఒక్కమాట నొక్కి వక్కాణింపగలను. ఈ సర్వేశ్వరు లుత్తమ కవీశ్వరులు. శాస్త్రధూళి నెసకొల్పుచు ప్రౌఢశైలిలో కక్కుర్తిపడకుండ చక్కని కవితను పరిఢవించుట సామాన్యము కాదు. వీరును సామాన్యులు కారు. మాన్యులు.

యస్వీ జోగారావు
20-6-68

ప్రొఫెసర్ శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు, *M A, Ph.D.*,
తెలుగు శాఖాధ్యక్షులు, కాకతీయ విశ్వవిద్యాలయము, వరంగల్లు.

# అభినందన

ఈ ఇరవయ్యో శతాబ్దం పూర్వార్థంలో భారత భాగవత రామాయణాది పురాణేతిహాసాలు తెలుగులో మరల వ్రాయబడ్డాయి. అందులోనూ ముఖ్యంగా రామాయణాన్ని ఎంతమంది ఎన్నిరకాల పేర్లతో యథాశక్తి వ్రాసి సంతృప్తిని పొందినారో లెక్కగట్టి చెప్పటం కష్టం. తెలుగు కవులకు రామాయణం మీద ఉన్నంత ప్రీతి భారత భాగవతాలమీద లేదు. అందువల్లనే రామకథను ఎంతగా వీలయితే అంతగా అంతమంది కవులు గానం చేశారు. చేశారు కాదు. చేస్తున్నారు కూడాను. అందుకు నిదర్శనమే శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావుగారు రచించిన ఈ శ్రీరామసుధాతరంగిణి. అయితే యిది రామాయణం అని చెప్పటానికి వీలయినదికాదు. ఇది నిజంగా శ్రీరామస్తుతికావ్యం. శ్రీరాముని పరబ్రహ్మతత్త్వమును కీర్తిస్తున్న కావ్యం. విశ్వనాథ సత్యనారాయణగారి మాటల్లో చెప్పాలంటే ఇది జీవుని వేదనను ప్రకటిస్తున్న కావ్యం. జీవుడు బ్రహ్మైక్యమును అభిలషిస్తున్న భేదములేని భక్తికావ్యం ఇది. శివకేశవ శక్త్యాత్మకమైన పరతత్త్వ స్వరూపంగా శ్రీరామనామకథా సుధారసమును ఆస్వాదయోగ్యం చేసిన కావ్య మిది. ఇదంతా శ్రీ సర్వేశ్వరరావుగారు తెలిసి చేసిన పనే. "నవ్యనవ్యముగ నెంతయు నీచరితంబుఁ బల్కెదన్" ఇది కవి వాక్కు.

ఒకవిధంగా దీన్నొక శతకమనిచెప్పవచ్చు. మొత్తం 154 పద్యాలున్నా మకుటం లేకపోయినా ముక్తకాలుగా అన్ని పద్యాలూ నామంతోనయినా, సర్వనామంతోనయినా శ్రీరామపరబ్రహ్మము నుద్దేశించే ప్రవర్తిస్తున్నాయి గనుకను, కవియొక్క ఆత్మనివేదన రూపమయిన ఆర్తి కావ్యవస్తువుగా అభివ్యక్తం అవుతూ వుండటంవల్లనూ దీన్ని శతకంలాంటి కావ్యమనే అనుకోవాలి. అర్చన- ఆముఖము- అనుతాపము- సుధాస్నానము- అవభృథము అనే అయిదు ఉపశీర్షికలున్నా, భావైక్యతే కాని కథానుస్యూతి లేనందున శతక ప్రక్రియలో వచ్చిన ఒక క్రొత్తరకం కావ్యంగా ఈ శ్రీరామసుధాతరంగిణిని భావించవచ్చు.

శ్రీ సర్వేశ్వరరావుగారు రామాయణాన్ని కాక అందలి కథాఘట్టా లను స్మరిస్తూ తాను ఆయాసందర్భాలలో ఆయాపాత్రులుగా మారుతూ శ్రీరామనామ సంకీర్తనంగా అద్వైతవేదాంతతత్త్వ ప్రతిపాదకంగా ఈ కావ్యాన్ని రచించారు. పాఠకుల సౌకర్యార్థం అన్ని పద్యాలకూ, తాత్ప ర్యాలను జోడించటమేకాక, కొన్నికొన్ని పద్యాలలోని విశిష్ట విషయా లనూ, వేదాంతార్థాలనూ, సప్రమాణంగా వివరించేపనికూడా చేశారు. ఇంత చక్కని భక్తి వేదాంత కావ్యమును రచించిన శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వర రావుగారి పరిణతచేతస్కతను అభినందించి తీరవలెను. చక్కని పద్య రచనా పాటవంగల శ్రీ సర్వేశ్వరరావుగారి జీవుని వేదనను సహృదయు లీకావ్యం చదివి, ఆత్మీయంగా భావించగలరు.

వరంగల్లు, కేతవరపు రామకోటిశాస్త్రి
23-6-86

---

సరస్వతీపుత్ర, పద్మశ్రీ, డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, కడప

## ఆశీస్సులు

మిత్రులు సర్వేశ్వరరావుగారికి,

మీరు ఈనడుమ వ్రాసిన జాబు చేరినది. పంపిన పుస్తకం కూడా అందింది. నేనీ మధ్య నెలరోజులకు పైగా ఊర్లో లేను. కడప యెండలకు భయపడి హంపీ కమలాపురంలో కాలం గడిపినాను. పోయిన నెల కడపట కడప చేరినాను. ఇంకా ఈ పాడు ఎండలు వేధిస్తూనే వున్నవి. శరీరం యే పరిశ్రమకూ సిద్ధంగాలేదు. మీ రచనపై వున్న చాపల్యంతో నాల్గు ముక్కలు వ్రాస్తున్నాను.

మీశైలి పూర్వ కవులందరిచేతా ఆదరింపబడినది. క్రొత్త క్రొత్త పోకడలు పైన పూసుకొని వయ్యారాలు చూపవలెననే చాపల్యం మీకు లేదు. ఈ గుణం నాకు చాలా ప్రియమైనది. లాలిత్యాన్ని సాధించుకో వలెననే ఆశ మీ రచనలో మొదటి నుండి కడపటి వరకు కనబడుతుంది. కొందరికి "ప్రౌఢి" సహజంగా వుంటుంది. కొందరు లేని ప్రౌఢిని ఆరోపించుకొని యేవేవో పదాలు వాడుతారు. పద్మ శబ్దాన్ని పుల్లింగంగా వాడుతారు. పుల్లింగంలో లేదే అని పాఠకుడు ఆకాశం చూస్తే "వా పుంసి పద్మం" అని వెక్కిరిస్తారు. ప్రసిద్ధమైన "ఆహితాగ్ని" శబ్దాన్ని వదిలి "అగ్న్యాహితుడూ" అంటారు. ఇదేమిటంటే "ఆహితాగ్న్యాదిషు" అనే వార్తికం చదివి వెకిలిగా చూస్తారు. ఇలాంటి వారిని చూస్తే, నాకు జాలివేస్తుంది. సంస్కృతంలో భవభూతి మురారి వంటి కొందరికి ప్రౌఢిమ సహజమైనది. తెలుగులో రాయలు శ్రీనాథుడూ మొదలైనవారు. ఇలాంటి వారిని కొందరిని వదిలిపెడితే, కాళీదాసాదులు అంతా లాలిత్యాన్ని ఆరాధించినవారే.

సంప్రదాయ బద్ధమైన – మర్కటచేష్టలు లేనిది – మీ రచన. చెప్పవలసిన దాన్ని స్పష్టంగా చెప్పటం, మీతో పాటు ఇతరులను గూడా చెప్పిన భావాన్ని అనుభవింపజేయడం మీ ధ్యేయం. సంస్కృతాంధ్రాలలో మీ భావాన్ని సాకల్యంగా చెప్పడానికి తగిన పరిశ్రమ మీకుంది. కొందరేవేవో అభూతకల్పనలు చేసి తామున్నూ తలపగుల గొట్టుకొని ఇతరులకూ అమృతాంజన ప్రాప్తి కల్గిస్తారు. మీ కల్పనలు గూడా చాలా లలితమైనవి. మీ జీవన వనమందు రాముడు పర్ణకుటి వైచుకొని వసింపవలెనట. ఈషణత్రయము, బంగారులేడితో పోల్చిచెప్పిన మీ భావము చాలా రమ్యమైనది.

మీ దృష్టిలో సరయూ తీరములో క్రీడించు రాముడు నవనీలమేఘసోదరులు శంపాలతలు. అప్పుడు చూచువారి హృదయములు మయూరములై పురులు విప్పినవట. మీ హృదయముకూడ నిట్లేయైనది.

రామకథనంపై వేదాంత పరముగా– జీవుని వేదనా పరముగ అన్వయించి చెప్పుకుంటూ పోయినారు. ఇట్లే చెప్పబోయినచో చాలా పద్యాలు మీ గ్రంథంనుండి ఉదహరింపవలసి ఉంటుంది. అసలు మీ బోటివారికి

పీఠికలు యేదో లాంఛనప్రాయాలు. రామసుధాతరంగిణి చక్కని మంచి భక్తి కావ్యం. మీరు అక్కడక్కడ చేసిన వాఖ్యలలో మంత్రశాస్త్రంలో మీకున్న చక్కని ప్రవేశం కూడా కనబడుతుంది.

మీవంటి రచయితలు ఈకాలంలో అరుదై పోతున్నారు. యాభై ఎనిమిదవ పద్యంలో మీరు చెప్పినట్లు, మీ వాగ్గీతులతో రాం పరబ్రహ్మాన్ని పూజించండి. ఇప్పటికి యీమాత్రం చాలు ననుకుంటాను.

పుట్టపర్తి నారాయణాచార్య
4-7-86.

---

ప్రొఫెసర్ యం. ఆర్. అప్పారావుగారు,
మాజీ శాసనసభ్యులు, మాజీ పార్లమెంటుసభ్యులు, ఆంధ్రవిశ్వవిద్యాలయ పూర్వాధ్యక్షులు, డైరెక్టరు-ఇన్‌స్టిట్యూట్ ఆప్ అప్లయిడ్స్ ఎకొనమిక్సు
మూ జీ వీ డు

## అభిప్రాయము

ఆర్యా,

మీరు దయతో పంపిన 'శ్రీరామసుధాతరంగిణి' అందింది. మీ రచనా విధానము, అందలి ఆధ్యాత్మిక తత్త్వవిచారము, వివరణములు చాలా ఆకర్షణీయంగా అపూర్వంగా ఉన్నాయి. భగవానుని సర్వవ్యాపక శివస్వరూపమగు శ్రీరామునికి మీరు కావించిన ఆత్మనివేదనము జీవు లందరి వేదనమే. రామమంత్రముయొక్క శ్రేష్ఠత, శివకేశవాత్మకత, పరతత్త్వాంశ ప్రతిపాదకత్వము, చక్కగా వివరింపబడ్డాయి.

ఈ కావ్యంలో మీ రనుసరించిన సంవిధానము వినూత్నము. ఆధ్యాత్మికత ఉన్నతోన్నతము. "రాముడీశ్వరుడు. మానవుడు జీవుడు. ఈశ్వరునికి జీవునికి మధ్య అవిద్య అడ్డుగా ఉన్నది. తాను వేఱని భావించుట వలననే జీవుడు కర్మఫలముల ననుభవింపవలసి వచ్చుచున్నది. జీవుని చేరదీయుటకు భగవానుని కృషి అవిరామము. రాముడు పురుషుడు. సీతవాని ప్రకృతి అనగా శక్తి. జీవుడింద్రుడు. ఇంద్రియాధిష్ఠాన శక్తులు దేవతలు. దేహిని బాధించు రాగద్వేషాదులే రాక్షసులు. సదసద్వివేకముగల మానవుడే మాయను గ్రహించి ప్రకృతిని పురుషునితో చేర్చ గలడు" ఈ మీ భావాలతో నే నేకీభవిస్తున్నాను.

ఈ కావ్యంలో బాలురు అలతిసంస్కారులు జిజ్ఞాసువుల అవగాహనం కొఱకు యడాగమములు అచటచట ద్రుతప్రకృతిక సంధులుకూడ మాని పేయఁబడినవని వ్రాశారు. చాలా మంచిపని చేశారు. మీరు పద్యముల క్రింద ఇచ్చిన వివరణాత్మక తాత్పర్యములు మిక్కిలి ఉపయోగంగాను, ఆనందదాయకంగాను ఉన్నవి.

ఇది గొప్ప గ్రంథం. రెండు దశాబ్దాలుగా వచ్చిన ఆధ్యాత్మిక కావ్యాలలో ఉత్తమమైనది. దీనిని అందఱు చదివి గ్రహించి ఆధ్యాత్మిక జాగృతులగుదురని ఆశిస్తున్నాను. "శ్రీరామసుధాతరంగిణి - శ్రీమతి అగస్త్యరాజు వైదేహి-స్మృత్యర్థము"-ఇచట మీరు వ్రాసిన పద్యం ఎంతో హృద్యంగాను, భావయుక్తంగాను, ధర్మప్రబోధకంగాను ఉంది. మీ రాకాంక్షించినట్లు మీధర్మపత్నిని శ్రీరామచంద్రుని కటాక్షం తప్పక కృతార్థురాలిని చేయగలదని ఆశిస్తున్నాను.

మీ కావ్యంలో సన్నాకర్షించిన వానిలో కొన్నిటిని మాత్రం పేర్కొంటాను.

1వ పేజి : అర్చనలో-మొదటి పద్యం-వివరణ - శారదాతిలకంలోని శ్లోకం-దాని సమన్వయం.

2వ పేజి : "ఒకడౌతత్త్వము" అనే పద్యం-ప్రకృతి నిర్వచనం-శ్రుతి వాక్యం-తస్మిన్...మూలప్రకృతిరాసీత్.

5వ పేజి : హనుమంతుని ప్రార్థన.

7వ పేజి : ఆముఖములో-"తత్పదలక్ష్యమున్" అనే పద్యం - దాని వివరణ.

12 నుండి 15 పేజీల వఱకుగల సమష్టి, వ్యష్టిరూప పరిశీలనములు.

17వ పేజి : బ్రహ్మాండ పిండాండముల సమన్వయము.

45వ పేజి : "నీకుం బుట్టుకతో బనేమి?" "స్వామీ తాఘవ!" అనే పద్యాలు.

52వ పేజి : "నిను నెడబాసి....రాక్షసావళిన్" అనే పద్యం. "శివ శ్శక్త్యాయుక్తో....స్పందితుమపి"-సౌందర్యలహరి శ్లోక పాదాలు.

63వ పేజి : "శబరీదత్త ఫలంబుగాఁ దలచి" అనే పద్యం

70వ పేజి : "సాగర లంఘనంబు....నా బ్రతుకు భాసిలు సుందర కాండమై యికన్" పద్యం-వివరణ.

78వ పేజి : "సతి సద్ధర్మవతిన్....ఆత్మ పరమాత్మం జేర్చు సామ్యం బునన్" పద్యం

85వ పేజి : అవభృథములో – "బ్రదుకున కర్థమేమి?" పద్యం.

89వ పేజి : "వేద్యము నీకయా.... మౌనమూనుదున్" పద్యం వివరణ

90వ పేజి : "ద్వైతాలంబము....నిల్చుంగదాజ్ఞేయమై" పద్యం.

అన్నీ ఇవేకాదు, ఇంకా యెన్నో ఉన్నవి. నా దృష్టిలో ఇది పరిమాణంలో చిన్నదైనా, విషయగౌరవంతోను, వ్యక్తీకరణంలోను, ధారాశుద్ధిలోను, మిన్నయైన సత్కావ్యం. జిజ్ఞాసువులకు మిక్కిలి ఉపయుక్తమయిన కావ్యం. మీకు నా అభినందనలు.

యం. ఆర్. అప్పారావు

'ఆంధ్రవ్యాస', 'కవికుల రత్నదీప', 'భాషాప్రవీణ'
శ్రీ యేలూరుపాటి అనంతరామయ్యగారు, M A.,
ప్రిన్సిపాల్, కె.వి.కె. సంస్కృత కళాశాల, గుంటూరు.

నా మనస్సు కదిలించినగాని కదలు లక్షణము కలది కాదు. కనుక నాకు సాక్షాన్మిత్రులు తక్కువ. కాని, వారు నాకు ప్రాణములు పొట్లము గట్టి యిత్తురు. కనుక మిత్ర మిత్రములను చూచుకొనినచో నేను మిత్ర సముద్రుడను. మనకు పరిచయము లేదు కాని, మనము చాలాకాలము నుండి మిత్రులమను వారు నాకు ఇంచుమించు ప్రతిగ్రామమునను ఎదు రౌదు రనగా నా మిత్రుల ఔదార్యమెట్టిదో తెలియగలరు. కావ్యకళాకృషీ వలులు అగస్త్యరాజు సర్వేశ్వరరావుగారు నా అదృష్ట విశేషమున నాకు సాక్షాన్మిత్రులయిన హృదయ బంధువులు. వారు నాకంటె పెద్దలు. వారు వ్యవసాయ మారంభించు నాటికి నేను 'అరక ఆవు' అనినానో, లేదో.

ఇరువురము శ్రీ వేంకటగిరి వల్లభసేవా పరతంత్ర హృదయులమై యున్నపుడు పరస్పర కుటుంబ మిత్రులమైనాము. తత్ఫలము శ్రీరామ సుధాతరంగిణి కీ కుంకుమపూజ. కాకున్నచో సుధాతరంగిణి అందును రామ సుధాతరంగిణిలో దూకి బారయీత యీదగల వారి కీ మునుగీత ప్రదర్శన మెందులకు?

శ్రీరామకథయే వడిదుడుకుల వరద గోదావరి. అందలి సుడులు మూరు వడులు దాటలేక ఆయన యేమయినాడో కాని, అట్టి యిడుమలలోనే పడినను ఆ దుడుకువడి యేరే సుధాతరంగిణి కాగలదు అంతస్తత్వ మూలయు గల్గిన భావకులకు.

కావుననే రామకథా సుధలోని ప్రతిబిందువును రుచులెన్నుచు ఆస్వా దించి ఊరడిల్ల గలుగు చున్నాడీ అగస్త్యరాజు సర్వేశ్వరుడు.

లోకములో ప్రతివాడును బాధపడు వాడే. తన బాధ పరులకు చెప్పి కొని వారును బాపథడు చుండగా ఊరటిల్లువాడు సామాన్యుడు. తనబాధలో బాధాతత్త్వ రహస్యము విప్పి, తనబాధ వినుటతో మనోతీతానందము

పేరులకు కలిగించువాడు కవి. తనుకనే కవి ఋణము తీర్పగల వాడింకను పుట్టవలసియే యున్నాడు.

వెన్నవంటి మనసు, తేనెవంటి పలుకు, అద్దమువంటి హృదయము, పసిపిల్లల కన్నులవంటి కన్నులు కలవారు కాని రామాయణ క్షీరసాగరము నిట్లు చిలికి సుధ తీసి అంతర్వాహినిగా తరంగిణిని పారింపలేరు.

శ్రీరామ సుధాతరంగిణిలో దూకుడని ఒకరన వలయునా? గోదావరి స్నానమునకు కొండుభట్లు న్నాజ్ఞ కావలయునా?

గుంటూరు,
25-7-68

యేలూరిపాటి అనంతరామయ్య



శ్రీ శ్రీ సత్యసందర్శనర్షి, సమర్థాశ్రమము, కనిగిరి.

హరిఃఓం

శ్రీరామసుధాతరంగిణియట ఈ చిన్ని పొత్తము. ఆహా! ఇతి వృత్తము రామనామసుధామృత మొక్కటియకాదు, ఆత్మానందరూపమగు నద్వైతవాహినీతరంగముల నోలలాడు సీతామహాసుందరితో రాముని అవినాభావైకీకరణమోగ రహస్యమో, శ్రీవిద్యారహస్యమో, ఉభయమో యనఁదగియున్నది. కవి భావోన్మాదమునఁ దన్నుఁదా మఱచి పొంగి పొవుచు నొక్కయెడను, దైన్యమునొంది శ్రీరామపరబ్రహ్మలీనత యాచించుచు నొక్కయెడను, అద్వైతానందమునఁ దృప్తుడగుచు నొక్క యెడను, 'రామోరామరామశ్చ' యను న్యాయమున బహురూప రామావతారముల నెత్తుచున్నట్లు నాకు గోచరించినాడు. మెప్పు లుప్పతిల నీకవి నాశీర్వదించి, కవిహృదయాంతస్థితుఁడో, కవినే తనయం దంశీభూతునిగా గొన్నవాడో యగు రాము నర్చించి నాహృదయమును గ్రంథ హృదయమునఁ గఱగించుకొని విరమించుచున్నాడ.

ఇట్లు
సత్యసందర్శనర్షి.



బహువిధ తూర్య నాదములు, వంది జనాదుల స్తోత్ర పాఠముల్,
బహుకృత వేదఘోషములు, పల్కులు, దీవెనలున్ ధ్వనింపఁగా,
బహుజన మౌని వానర సుపర్వ సురాహిత ముఖ్యులెల్ల ధూ
ర్వహులయి, భద్రపీఠమునఁ బట్టముగట్టిన నిన్నెఁ గొల్చెదన్॥

# కృతజ్ఞత

శ్రీరామ సుధాతరంగిణికి
భూమికను వ్రాసి పంపిన ఆంధ్రకల్హణ, సాహిత్యసమ్రాట్, మహాకవి,
కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి,
ఉస్మానియా విశ్వ విద్యాలయ తెలుగు శాఖా పూర్వాచార్యులు కళాప్రపూర్ణ
డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధాని, M.A. (Hons.) Ph.D., గారికి,
సహృదయ భూమిక వెలయించిన మధురసరస్వతి మహాకవి, సాహిత్య
రత్నాకరేత్యాది బిరుదాంకితులును, ఆంధ్ర విశ్వవిద్యాలయ తెలుగుశాఖా
జాతీయాచార్యులు, ప్రొఫెసర్ శ్రీ యస్వీ జోగారావు, M.A., Ph D.,
D.Litt. (Hony), గారికి,

అభివందన తెల్పిన కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు,
ప్రొఫెసర్ శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి, M.A., Ph.D., గారికి,
ఆశీస్సు అందించిన సరస్వతీపుత్ర, పద్మశ్రీ
డాక్టర్ శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి,
అభిప్రాయము ను ప్రకటించిన ఆంధ్ర విశ్వ విద్యాలయ పూర్వాధ్యక్షులు,
మాజీ శాసనసభ్యులు, మజీ పార్లమెంటు సభ్యులు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్
అప్లయిడ్ ఎకొనామిక్స్ డైరెక్టర్
ప్రొఫెసర్ శ్రీ యం.ఆర్. అప్పారావు గారికి,
మధురభావన తెల్పిన ఆంధ్రవ్యాస, కవికులరత్నదీప, భాషాప్రవీణ,
శ్రీ యేలూరిపాటి అనంతరామయ్యగారికి,
రాష్ట్ర గురు జాతీయ ధర్మపీఠము మహంత్ శ్రీశ్రీ సత్యసందర్శనర్షిగారికి
కవి పరిచయము గావించిన సాహిత్యరత్న
చిరంజీవి మంచికంటి వేంకట రామకృష్ణ, B.A., (Litt ) గారికి,
గ్రంథ ముద్రణకు ఆర్థికముగ తోడ్పడిన
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి,
ముద్రణమున సహకరించిన సాయీ ప్రింటర్స్ వారికి,
సహృదయ పాఠకులకు-
కృతాంజలినై కృతజ్ఞత తెల్పుకొనుచున్నాను.

-రచయిత

# మనవి

శ్రీరామచరితము భారతీయ సంస్కృతికి భావనాపద్ధతికి దర్పణము. ఆధునికులలో కొందఱు రామాయణ కథను గూర్చియు అందలి పాత్రల గుఱించియు, హనుమంతుని సముద్ర లంఘనము, సేతు నిర్మాణము, కుంభకర్ణుని నిద్రా భోజన పరాక్రమములు, మున్నగు విషయముల గుఱించియు విశ్వసింపదగినవేనా యని సంశయముల వెల్లడించు చున్నారు. రామాయణము త్రేతాయుగము నాటిది. మధ్య ఒక యుగమే గడచినది. కొందఱు పదునెన్మిది మహాయుగములకు పూర్వముగల త్రేతా యుగమునకు చెందిన దనుచున్నారు. ఏమైనను అలనాటివారి శక్తి సామర్థ్యములు నేటి మానవుల శక్తియుక్తులతో పోల్చి నిర్ణయింప తగదు. అంతదాకెందుకు ? మన తాత తండ్రుల శరీర దార్ఢ్యము, నైతిక నిష్ఠ, ఆధ్యాత్మిక బలములు ఈ తరము వారిలో ఎంత తఱిగిపోయినవో ప్రత్య క్షానుభవములో ఉన్నవికదా! కనుక వానినిగూర్చి నిరుపయోగముగ ఆలోచించుటకంటె ఆధ్యాత్మికముగ రామాయణ మెట్లు మార్గదర్శకమో యోజించుట సమంజసము.

ఈశ్వరానుగ్రహమునకు కర్మ జ్ఞాన భక్త్యాది మార్గములున్నను, భక్తి శ్రేష్ఠమగుటచే అందు నవవిధములగు భక్తిమార్గములలో నొకటగు ఆత్మనివేదనము ప్రధానముగా ఈ శ్రీరామ సుధాతరంగిణి ప్రవహించినది. జ్ఞానాదులు కూడ సముచితముగ చోటుచేసికొనినవి. భగవానుని సర్వ వ్యాపక శివస్వరూపమగు శ్రీరామునికి ఆత్మనివేదనము కావింపబడినది. రామమంత్ర మెట్లు శ్రేష్ఠమో, శివకేశవశాక్త్యాత్మకమో, పరతత్త్వాంశ ప్రతిపాదకమో కూడ వివరించబడినది.

రాముడు కేవల మొక రాజపుత్రుడుకాడు. అట్లే సీతను స్త్రీమాత్ర యనరాదు. రామరావణ యుద్ధము అపహృతయగు జానకీ విమోచన మునకే జరిగిన దనుటయు సరికాదు. వాని అంతరార్థములు వేఱు. రామాయణమున భారతీయుల ఆధ్యాత్మిక సంపద అంతయు నిక్షిప్తమై

యున్నది. రామాయణ కథాసంవిధానము అమోఘము. భావన అగాధము. ఆధ్యాత్మికత మహోన్నతము. ఇంతయేల సమన్వయించువాడుండవలె కాని ప్రతి సన్నివేశము ఒక నిగూఢ రహస్యమును తెలుపగలదు.

రాము డీశ్వరుడు. మానవుడు జీవుడు. జీవు నుద్ధరించుటకు ఈశ్వరుడు చేసిన ఘనకార్యములెన్నో! ఇరువురికి మధ్య అవిద్య అడ్డుగానున్నది. ఈ అవిద్య వలననే జీవుడు, తాను వేఱని భావించి, అహంకరించి, కర్తృత్వము వహించి, కర్మ లొనర్చుచున్నాడు. కర్మఫలమును బట్టి వానికి బహు జన్మములు సుఖములు దుఃఖములు కలుగుచున్నవి. తన నుండి దూరమగుచున్న జీవుని చేరదీయుటకు భగవానుని కృషి అవిరామము. ఆ మార్గమున కలిగినవే అవతారములు.

రాముడు పురుషుడు. సీత వాని ప్రకృతి అనగా శక్తి. పురుష ప్రకృతులు అగ్నిదాహక శక్తుల వలె ఒకటే అయ్యును, ప్రకృతిచే ప్రభావితుడై, పురుషుడు కార్యోన్ముఖుడగుచున్నాడు. ఇట్లనుటకంటె పురుషుని మూల ప్రకృతియే సకల కార్యములకు కారణ మగుచున్నది. సీత కారణముగనే రామరావణ సంగ్రామము జరుగుట ఇందు కొక నిదర్శనము. ఇదియే కావ్యహృదయము.

జీవు డింద్రుడు. ఇంద్రియాధిష్ఠాన శక్తులు దేవతలు. దేహిని బాధించు రాగ ద్వేషాదులే రాక్షసులు. కామము రావణుడు కాగా, అజ్ఞానము (అతినిద్రాలోలత్వము) కర్మఫల భోక్తృత్వము (భోజనప్రియత్వము) క్రూరకర్మాచరణముతే కుంభకర్ణుడు. సదసద్వివేకము విభీషణుడు. తామస భావము తాటకి. విచక్షణారహిత కామప్రవృత్తి శూర్పణఖ. కామము ననుగమించు క్రోధ లోభాదులు ఖరదూషణాదులు. ఈషణ త్రయము బంగరు జింక. సద్గురుడు హనుమంతుడు. ప్రకృతిభావము తమసానది. వైరాగ్యము ఋష్యమూకము. సంసారము సాగరము. సీతాన్వేషణము సత్యమును వెదుకుటయే. బ్రహ్మాస్త్రము బ్రహ్మజ్ఞానము.

**సదసద్వివేకముగల సత్పురుషుడే మాయను గుర్తింపగలడు.**

ప్రకృతిని పురుషునితో చేర్పగలడు. అనగా చిత్తమును భగవదాయత్తము చేయగలడు. మనస్సు సీత, వచస్సు రాము డగుటచే సీత లేక రాముడు లేడు. ఈ దృష్టితో రామాయణ మందలి ప్రధాన ఘట్టముల యథాక్రమముగ ధ్వనింపజేయుచు, జీవుడు తన ఆర్తిని భగవంతునికి నివేదించుకొని, బంధ విముక్తి కోరుట ఇందు వర్ణింపబడినది. ఇది నా యొక్కని వేదనకాక జీవులందరి నివేదనము.

కథాఘట్టముల నాధారము చేసికొని వేదాంతార్థముల వెలికిదెచ్చు నాయీ ప్రయత్నమునకు పూర్వపీఠికగా హిందూ వేదాంత స్వరూపమును "ఆముఖ"మందు రేఖామాత్రముగ తెల్పుటకు యత్నించితిని, అందు కొన్ని పద్యములు జిజ్ఞాసువులుకాని సామాన్య పాఠకులకు దురవగాహముగ తోచినను, త్యాజ్యములు కావని ఆశించుచున్నాను. ఇక నితర ఘట్టము లందలివి జీవుని అనుభూతితో సమన్వయింపబడుటచే ఆత్మీయములే కాగలవు.

ఇందలి పద్యములలో కథాభాగము కేవలము 94 వృత్తములందే ఇమిడినది. ఈ సంఖ్య తత్త్వగతములై వాని క్రియాశక్తి రూపము లయిన కళల సంఖ్యతో సరిపోవుట యాదృచ్ఛికముగ జరిగినను, ఒక విశేషముగను, శ్రీరాముని అనుగ్రహ సూచకముగను తలచెదను. ఇట్లు కళాత్మకమైన ఈ కావ్యమున, బాలురు అలతిసంస్కారులు జిజ్ఞాసువుల అవగాహనముకొఱకు, కొన్ని సందర్భములలో యడాగమములు, అచటచట ద్రుతప్రకృతి సంధులు కూడ మానివేయబడినవి. పాఠకుల సౌలభ్యముకొఱకు పద్యములక్రింద ప్రధానభావములు వివరణాత్మకముగ తాత్పర్య రూపమున తెలుపబడినవి. ఇందలి దోషముల రసజ్ఞులగు విజ్ఞులు మన్నింతురుగాక !

ఇట్లు,

అర్ధంకి,
తే. 14-6-86

అగస్త్యరాజు సర్వేశ్వరరావు



## శ్రీమతి
## అగస్త్యరాజు వైదేహి
## స్మృత్యర్థము.

దేహము వీడి కాలగతిఁ ద్రెళ్ళియు, వీడని కాంతి పూరమై
నా హృది నిండి నేఁడు రఘునాథ పదాబ్జము లర్చసేయ, న
వ్యాహిత వాక్ప్రసూనముల నాదటఁ గూర్చిన నాదు పత్ని వై
దేహిని రాముఁ డవ్యయగతిం గరుణించుత, సుప్రసన్నుఁడై ॥

దేహము వీడినను, వీడని కాంతి ప్రవాహముగా నా హృదయమున ప్రవేశించి, శ్రీరాముని పాద పద్మముల నర్చించుటకు క్రొత్తగా కూర్చ బడిన శబ్దములనెడి పూవులను ప్రీతితో సేకరించి సిద్ధముచేసిన నా ధర్మపత్ని యగు వైదేహిని కరుణించి, సుప్రసన్నుడైన శ్రీరామచంద్రుడు, ఆమెకు అవ్యయగతిని చేకూర్చుగాక!

తన నిర్గమనమువలన ఆమె నాలో వైరాగ్యమును కల్పించి, "దేహము అనిత్యము–ఆత్మ సత్య"మను జ్ఞాన రూపమున నాలో ప్రవే శించి, రాముని నుతించుటకు అనువైన శబ్ద భావముల నా కందించి తన ధర్మపత్నిత్వమును మరణానంతరము సైతము నిరూపించినదని ధ్వని.

సీతయే పరోక్షముగ రాముని కార్యోన్ముఖుని చేసెనను కావ్య హృదయము, శక్తియే సకల కారణ భూతమను తత్త్వార్థము, స్మరింప బడినవి.

# అంకితము

శా|| శ్రీరామా! సుగుణాభిరామ! త్రిజగచ్ఛ్రీకామ! కామాది సం
హార ప్రోత్థిత భవ్య ధీర హృదయాహ్లాదైక ధామా! కృపా
సారాసాదక నీల నీరద తను శ్యామా! జయస్తోమ! త్వ
త్కారుణ్యంబు సుధా తరంగిణిగ నా కావ్యంబున న్నిల్పుమా॥ 1

శ్రీరామా! మంచిగుణములచే ఒప్పిదమైనవాడా! మూడు లోకములకు శుభమును కోరువాడా! కామము మున్నగు అంతశ్శత్రువుల సంహారముచే మంగళకరమైన ధీరుల హృదయారవిందములు నిలయమైన వాడా! జయపరంపర గలవాడా! నీ దయను అమృతవాహినిగ నా కావ్యమందు నిల్పుము.

సుగుణములను, లోకహితమును, అంతఃశత్రు సంహారమును, ఆనందమును, దయను, జయమును నాకు కల్గింపు మనియు, శ్రీరామ సుధాతరంగిణి అను ఈ కావ్యమున నీ అనుగ్రహము నిల్పు మనియు ఆకాంక్ష!

ఉ॥ శ్రీసతి వాసమౌ హృదయ సీమ వెలుంగుల తోరణంబుగా
భాసిలు తారహార సహవాసము గూర్పుము స్తోత్రమాల, కో
దాస జనానుకూల! ఇది తావక భృత్య నివేదనంబు, నీ
కోసమె తెచ్చితిన్ హృదయ కోశము విప్పి; పరిగ్రహింపుమా! 2

లక్ష్మి నివాసమైన నీ హృదయమునకు, దీపుల తోరణముగా ప్రకాశించు నక్షత్రముల పంక్తితో, ఈ స్తోత్రమాలకు సహవాసము కల్పింపుము. ఓదాసజనానుకూలా! శ్రీరామ సుధా తరంగిణియను ఈ స్తోత్రమాల, నీ సేవకుని నివేదన రూపమైన వేదనము. దీనిని నా హృదయపు ధనాగారమును తెఱచి, నీకొఱకు తెచ్చితిని. పరిగ్రహింపుము.

నీ రూపము నక్షత్రమండలము దాఁటి యున్నదనియు, ఈ స్తోత్రమాలను ఆదరించి నీ హృదయమున నక్షత్రమాల వలె ధరింపు మనియు భావము.

చ॥ వరుఁడవు రక్షకుండవు గృపా పరిపూర్ణుఁడ వీవు. దేవ! నీ
చరణ నవారుణ ద్యుతి, యశాంతి తమిస్ర సహోదయంబుగా
విరచితమౌచు, నా హృదయ వీథి వివేక మయూఖ మాలికల్
వఱచ నవార్ఘ్య మిచ్చెద శుభంబును గోరి కృతిప్రసంగతిన్॥ 3

దేవా! నీవు పరమాత్మవు. రక్షకుండవు. దయాపరిపూర్ణుండవు. నీ పాదములయొక్క నూత్నమైన ఎఱ్ఱనికాంతి, అశాంతి యనెడి చీకటి రేయికి ఉషోదయముగా నేర్పడి, నా హృదయ వీథిలో వివేకమనెడి కిరణ సమూహముల వ్యాపింపజేయుగా, శుభమును (మోక్షమును) కోరి, నీకు ఈ కృతి రూపమున వినూతనమగు అర్ఘ్యము నిచ్చెదను.

శా॥ వైదేహీ సహితుండవై నిలుము, నా ప్రాణానిల స్పందనన్
నీదౌ సన్నిధిఁజేరి విస్తృతుఁడనై నిర్మోహినై చూతు నే
యాధారంబును లేని లోకముల జీవాధార తత్త్వంబు; నీ
పాదాబ్జంబుల భృంగమై నిలిచి కావ్యానందము న్గూర్చెదన్॥ 4

వైదేహితో కూడ వచ్చి నిలువుము. నా ప్రాణవాయువుల స్పందనతో నీ సన్నిధిని చేరి, పరిధి నతిక్రమించి, వ్యాప్తిగాంచి, మోహము లేనివాడనై, ఏ ఆధారము లేని లోకముల జీవమునకు (ఉనికికి) ఆధారమైన తత్త్వమును, నేను చూచెదను. ఇంకను నీ పాదపద్మముల చెంత తుమ్మెదనై నిలిచి, నీకు కావ్యానందమును చేకూర్చెదను.

ఉ॥ నేనేగా, గుఱుతింపవో! మఱచితో? నీ కాంతిలోఁ గాంతినై
యీనాఁ డిట్లు చరింతు మానవుఁడనై; ఎన్నాళ్ల కెన్నాళ్లకీ
జ్ఞానార్చిన్ వెలిగింప వచ్చితివి యజ్ఞానంబు పోకార్పగా;
నే నిత్తుం గృతి నంచుఁ బల్కుటకు నా-నీ భేద మెందుండెరా? 5

నేనే కదా! నన్ను గుర్తింప లేదా? లేక మఱచితివా? నీ కాంతితో కాంతినై యుండిన నేను, నేడిట్లు మానవుడనై చరించుచున్నాను. నా అజ్ఞానమును మాపు ఈ జ్ఞాన జ్వాలను (నేనే నీవను ఎఱుకను) ఎన్నాళ్లకు వెలిగింప వచ్చితివి? క్రొత్తగా కల్గిన ఈ ఎఱుక దృష్ట్యా, కృతిని నీకిత్తునని పల్కుటకు, నేను-నీవు అను భేదము లేదుకదా! కృతి, కృతికర్త, కృతిభర్త అనెడి సంకుచిత భావము తొలగి త్రిపుట్యైక్యము కలిగినదని అర్థము.



శ్రీమాత్రేనమః శ్రీరామాయనమః

# శ్రీరామసుధాతరంగిణి

## అర్చన

శా॥ శ్రీదేవీ సుమనోజ్ఞ దృగ్విషయ రాశీభూత లక్ష్యంబు, ల
క్ష్మీ దివ్య ద్ధృదయారవిందమధుమ చ్ఛ్రీ చిద్విలాసంబు, బ్ర
హ్మాది స్తుత్య నిరంత నిరవ మహాహ్లాదై క రూపంబునౌ
నాదంబుం బ్రణవై కతత్త్వ మనుసంధానంబు గావించెదన్। 1

శ్రీదేవియొక్క మనోజ్ఞమయిన నేత్రేంద్రియమునకు అనగా కంటికి చూపుకు ఏకైక లక్ష్యమైనట్టిదియు, లక్ష్మీదేవియొక్క ప్రకాశించుచున్న హృదయ పద్మమందలి మధువును కల్గిన చైతన్య విలాసమైనదియు' బ్రహ్మాదులచేత పొగడతగి, శాశ్వతమై, అంతటను నిండిన గొప్ప ఆనంద స్వరూపమైనదియు, నాదమైనదియు అగు ఓంకారరూప పరబ్రహ్మ తత్త్వమును ధ్యానించెదను.

నాద మనగా సృష్టికి ఉన్ముఖమైన శివ-శక్త్యాత్మకమగు తొలి స్పందనము. ఇది శబ్దముయొక్క పూర్వ రూపము. అతిసూక్ష్మము. దీనినే ఋషులు ఓంకారముగ దర్శించిరి. ఇందుండియే క్రియాశక్తి (పరాశక్తి లేక పరావాక్కు) పుట్టుచున్నది. ప్రాణులలో ఈ నాదమే కుండలిని అగుచున్నది. సృష్టి కంతకు మూల మిదియే.

"సచ్చిదానంద విభవా త్సకలా త్పరమేశ్వరాత్
ఆసీ చ్ఛక్తి స్తతో నాదో నాదా ద్బిందు సముద్భవాః"–

—శారదాతిలకం.

సృజనాత్మక సామర్థ్యముతో కూడిన సకల పరమేశ్వరునుండి శక్తియు, శక్తినుండి నాదమును (సాదాఖ్య లేక సదాశివుడు), నాదము నుండి బిందువును (ఈశ్వరుడు), దానినుండి త్రిబిందువులును లేక త్రికోణాత్మక కామకళయు (సత్త్వరజస్తమోగుణావిష్టులగు విష్ణు బ్రహ్మ రుద్రులు), కలిగినట్లు తంత్రములు తెలుపుచున్నను, ఇవి యన్నియు సృష్టికల్పన కుపక్రమించిన శక్తియొక్క వివిధ దశలు మాత్రమే. ముప్పది యారు తత్త్వములలో గల సదాశివ తత్త్వమే మంత్రశాస్త్రమున నాదముగా పిలువబడుచున్నది. ఈ సదాశివ తత్త్వమునే వైష్ణవులు మహావిష్ణువనియు, బౌద్ధులు అవలోకితేశ్వరుడనియు చెప్పుదురు. నిజమున కిక్కడినుండియే అన్ని అవతారములు ప్రారంభ మగుచున్నవి. ఈ తత్త్వమున అహం ప్రధానమైనందున, ఇదియే ప్రపంచ సృష్టికి ప్రారంభము.

ఇక ప్రణవమనగా ఓంకారము. "తస్యవాచకః ప్రణవః" పాతంజలి. ఆయన పేరు ప్రణవము. "ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ। ధ్యేయం సర్వ ముముక్షుభిః" తేజోబిందూపనిషత్తు. ఓంకారమే బ్రహ్మము. అదే మోక్ష కామికి ధ్యేయము. "ఓ మిత్యేత దక్షరం పరం బ్రహ్మ। త దేవోపాసితవ్యం" తారసారోపనిషత్తు. "ఓమ్" అను ఆయక్షరమే పరబ్రహ్మ. అదే ఉపాసించతగినది.

మ॥ ఒకఁడౌ తత్త్వము సృష్టి సంస్థితి లయోద్యోగంబులం బూని, తా
నొకచో స్రష్టగ నొక్కచోఁ బ్రభువుగా నుగ్రుండుగా నొక్కచో
సకలంబైన, గుణాత్మక ప్రకృతి తచ్ఛక్తి స్వరూపంబులం
బ్రకటింపన్, స్ఫురియించు దంపతులఁ గావ్యాదిం బ్రశంసించెదన్॥ 2

ఒకటేయగు పరబ్రహ్మతత్త్వము, సృష్టి స్థితి సంహారములు సేయు యత్నమున ఒక చోట (సత్యలోకమున) బ్రహ్మగా, మఱొక్కచోట (వైకుంఠమున) విష్ణువుగా, ఇంకొక తావున (కైలాసమున) మహేశ్వరుడుగా రూపు దాల్చియుండ, సత్త్వరజస్తమోగుణములే స్వరూపమయిన మూలప్రకృతి వారివారి శక్తులను, ఆ శక్తుల స్వరూప స్వభావములను ప్రకటించినది. ఇట్లు వ్యవస్థీకరింపబడి పురాణ దంపతులై స్ఫురిం

చిన వాణీహిరణ్యగర్భులను, లక్ష్మీనారాయణులను, ఉమామహేశ్వరులను కావ్యారంభమున కీర్తింతును. వారు శుభముల ప్రసాదింతురు గాక!

త్రిమూర్తులు వారి శక్తులు అభిన్నమే అయినను, లోకవ్యవహారము కొఱకు భార్యాభర్తలుగా భావింపబడిరని తెలియవలెను. స్త్రీ-పురుష వివక్షత లేని పరతత్త్వమున భార్య యెవరు? భర్త యెవరు? కాగా, శక్తికి శక్తిమంతునకు అభేద మైనందున బ్రాహ్మీశక్తి (వర్చస్సు) ముఖమందును, వైష్ణవీశక్తి (వ్యాపకరూపమైన భావన) హృదయమందును, రౌద్రీశక్తి (క్రియారూపమయిన సత్తా లేక దేహబలము) శరీరమందును వ్యక్తమగునని గ్రహింపవలెను.

"ప్రకర్షేణ మహదాది కార్యకారణసంఘాతం కరోతీతి ప్రకృతిః"

మహత్తత్త్వము మొదలగు కార్య కారణ సమూహమును చక్కగా చేయునది ప్రకృతి. ఇది పరమాత్మకంటె భిన్నమైనది కాదు. ఎండమావులలో నీరువలెను, ముత్యములో వెండివలెను, కట్టుదుంగయందు పురుషుని వలెను, స్ఫటికమున రేఖవలెను భ్రాంతిని కూర్చుచు సత్త్వ రజస్తమో గుణములు కలిగి పరమాత్మయందే తోచుచు, మూలప్రకృతి యనబడుచున్నది.

"తస్మిన్ మరుశుక్తికా స్థాణుస్ఫటికాదౌ, జలరౌప్య
పురుషరేఖావద్ లోహితశుక్లకృష్ణ గుణమయీ
గుణసామ్యాఽ నిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్॥"

-శ్రుతి (పైంగలోపనిషత్)

శా॥ ప్రాణంబుల్ శ్రుతిచేసి నిల్పి, యెద నాలాపించి, మేల్కొల్పి, ని
ద్రాణంబై వినరాని నాదము విశుద్ధ స్పష్ట వాగ్వైఖరిన్
వీణాదండమునన్ ధ్వనింపఁ బ్రథమున్ విఘ్నేశు విఘ్నారిఁగ
ల్యాణున్, గానమొనర్తు సిద్ధిమని మూలాధార శక్త్యుద్గతున్। 3

ప్రాణములనెడి తంత్రుల శ్రుతిచేసి క్రమపద్ధతిని నిల్పి, హృదయ రాగమును మెల్లగా లాగి పల్కించి, నిద్దుర మత్తులో మంద్రాతిమంద్రమై శ్రుతికి గోచరముకాని నాదము, నిర్దుష్టము స్పష్టము అగు వైఖ

వాక్కుగా వీణాదండమున ప్రతిధ్వనించునట్లు ప్రథముడు విఘ్నముల కధినాథుడు విఘ్ననాశకుడు శుభుడు సిద్ధిప్రదుడు మూలాధారశక్తి నుండి పుట్టినవాడు అగు వినాయకుని గానము సేయుదును.

మూలాధార చక్రమున గజాననుడుండి, జీవులకు ప్రవృత్తి నివృత్తి మార్గముల చూపుచుండునందురు. పుఱ్ఱెతో కూడిన వెన్నెముకయే బాహ్యముగ గజాననుని శిరము వక్రతుండమని రహస్యార్థము. ఇందే షట్చక్రములతో కూడిన కుల (సుషుమ్న) మార్గమున్నది. అసలు కుండలినియే గణపతియని కొందఱి మతము. ఏ కార్యము సాధింపవలెనన్నను తొలుత గణపతిని పూజించి, వాని అనుగ్రహము పొందవలసినదే. అనగా కుండలిని మేల్కొల్ప వలసినదే. అందుకే సంకల్పానంతరము ప్రాణాయామము చెప్పబడినది.

ప్రాణాయామము (ప్రాణముల క్రమబద్ధముచేయుట) వలన, అంతవఱకు మూలాధారమున నిద్రించుచున్న కుండలినీశక్తి (పరానాదము లేక ఆత్మయందలి విమర్శాశక్తి) జాగృతమై, ఊర్ధ్వగామిని యగును. మూలాధారమందలి పరమేశ్వరుని ఇచ్ఛారూప పరానాదము (కుండలిని), సస్పందనమయినను, వినపడదు. అది బీజరూపమున తనలోనున్న జగత్తును ప్రకటించు యత్నమున, పశ్యంతీ నాదముగా (ఒక విధమైన శబ్దస్థితి) మణిపూరమందును, మధ్యమ నాదముగా (అక్షరవాసనా దశ లేక మాతృకావర్ణరూపము) హృదయమందలి అనాహత చక్రమందును, అక్షరాకృతినిదాల్చి వాగ్రూపమున కంఠస్థాన మందలి విశుద్ధచక్రమున వైఖరీ నాదముగా స్పష్టతను సంతరించుకొని వ్యక్తమగును.

వెన్నెముకయే వీణాదండము. వీణాదండమందలి ఒక్కొకక్క మెట్టున ఒక్కొక్క ధ్వని కలుగునట్లు కుండలిని షట్చక్రముల భేదించుకొనుచు పోవునపుడు గజ్జెల రవళి, ఘంటానాదము, శంఖ వీణా వేణు భేరీ మృదంగాదుల నాదములవంటి దశవిధధ్వనులు వినబడుటను యోగులు గుర్తింతురు.

చం॥ స్ఫురదుదయార్క రాగరుచి సుందరు, వానర యూథముఖ్యు, దు
స్తర భవ సింధు తారణ విశారదుఁ, గల్మష దానవౌఘ సం
హరణ ధురీణు, రామ చరణాంబుజ సంతత చింతనా పరుం,
గరము నుతింతు మారుతినిఁ గావ్య రస గ్రహణానురక్తునిన్ 4

ఉదయించు సూర్యుని అరుణకాంతివలె అందమైన వాడును, వానర సమూహమున ముఖ్యుడును, దాటుటకు శక్యముకాని సంసార సాగరమును లంఘించజేయుటందు నేర్పరియు, పాపము అనెడి రాక్షస సమూహముల సంహరించు భారము వహించిన వాడును, శ్రీరాముని పాదపద్మముల నెల్లప్పుడు చింతించు వాడును, కావ్యరసగ్రహణాసక్తుడును అగు మారుతిని ప్రార్థింతును.

హనుమంతుడు నవవ్యాకరణవేత్త. స్వయముగా రామాయణము రచించిన కవి. ఇట్లు పండితకవియైన హనుమంతుని ప్రసాదమువలన నా కావ్యము శోభించుననియు, రామదాసుడగు ఆయన యనుగ్రహము నా భక్తి భావమునకు ప్రేరకము కాగలదనియు ఆకాంక్ష.

ఉ॥ జగదుత్పత్తికి హేతుభూతమగు చిచ్ఛక్తి స్వరూపున్, గురున్,
విగళచ్ఛిష్య మనోవికారుఁ, గృత సంవిత్పూర్ణు, సత్యస్ఫుర
న్నిగమంతార్థ విభూతి భూషణుఁ, గృపా నిర్దేశికున్, దేశికున్,
సగుణు, న్నిర్గుణు, రక్తశుక్ల పదకంజాతుం బ్రశంసించెదన్॥ 5

జగత్తు ఏర్పడుటకు ఆది కారణమగు చిచ్ఛక్తి స్వరూపమే అయిన వాడును, గొప్పవాడును, తొలగిన శిష్యుల మనోవికారములు కలవాడును, పూర్ణజ్ఞాన స్వరూపుడును, సత్యముచే భాసించు ఉపనిషత్తుల అర్థ సంపదయే ఆభరణమైన వాడును, ఎఱ్ఱని తెల్లని పాదపద్మములు గల వాడును, అగు గురుని నుతింతును.

"శ్రీగురుః సర్వకారణభూతాశక్తిః- భావనోపనిషత్తు. ప్రారంభక శక్తియే గురువు. ఆ శక్తి విమర్శరూపమైనది. అనగా ఆత్మను గ్రహించు నట్టి (గ్రాహక), గ్రహింపదగినట్టి (గ్రాహ్య) శక్తి అన్నమాట. అది

ప్రకాశమయిన లేక భావాదుల రూపమున కనుపించినదానిని, విమర్శించి వస్తు పూర్వకముగ నిర్ధారణ చేసి చూపు పరమేశ్వరుని సామర్థ్యము. పరమ శివునిలో సృష్టికామన కనుపింపగా దానిని గ్రహించి (విమర్శించి) ప్రపంచ రూపమున కార్యాచరణమున పెట్టినదా పరాశక్తియే కదా! మానవుని యందిది వివేకరూపమున భాసించుచు, భావనకు, సత్యమును గ్రహించు టకు, అవకాశ మిచ్చుచున్నది. అంతేకాని ఎఱుక వెలుపలినుండి వచ్చుట లేదు. తననుండి వికసించుచున్న పరాశక్తి అది. కనుక "అహమ్" యొక్క పుట్టువును పూర్వోత్తరములను తెలుపు గురువునకు, ఈ గ్రాహకశక్తికి అభేద మని తెలియవలెను.

ఈ గురువు సంశయముల తొలగించెడి జ్ఞాన ప్రపూర్ణుడు. సత్య ముచే శోభించు వేదాంతార్థ సంపద అభరణముగ గలవాడు. గుణ యుతుడై మనతో నడచుచు, మనల గుణరహిత స్థితికి చేర్చువాడు. ఈయన పాదపద్మములు ప్రకాశ (తెల్లని) విమర్శ (ఎఱ్ఱని) స్వరూప ములు. తెలుపు శుద్ధ సత్త్వము దానిద్వారా పురుషుని తెలుపగా, ఎఱుపు రజోగుణమును, తద్ద్వారా సృష్టికి ఆదికారణమగు ప్రకృతిని సూచిం చును. అనగా పురుష ప్రకృతుల, -శివశక్త్యాత్మక- సమష్టిరూపమని భావము.

ఈశ్వరుడు శుక్లవర్ణ మనినపుడు, శుద్ధస్ఫటికము వ టివాడని ఎఱుగ వలెను. స్ఫటికమునకు వస్తుతః ఏ వర్ణము లేకున్నను, సన్నిహితమైన వస్తువర్ణమునుబట్టి ప్రకాశించును. రజోగుణ ప్రధానమైన శక్తి, వామ భాగమై యుండుటచే, వామపాదము రక్తవర్ణము కలదిగా గురుపూజ నమున భావింపబడును.

"వందే గురు పద ద్వంద్వ మవాఙ్మా నసగోచరం
రక్త శుక్ల ప్రభా మిశ్ర మతర్క్యం త్రైపురం మహః"

ఉ॥ ఆదికవిం బరాత్పరు ననంతజగ త్ప్రభవైక కారణున్
స్వోదిత వేదవాఙ్మయుని స్తోత్రముచేసి, ప్రచేతసాత్మజా
రాధన సల్పి, మ్రొక్కెదఁ బరాశరసూతికి వేదమూర్తికిన్,
స్వాదుకవిత్వపారగుల సత్కవులం బ్రణుతింతు నెల్లరన్॥ 6

అనంత విశ్వకల్పన మొనర్చినవాడును, వేదవాఙ్మయ నిర్మాతయు అగు ఆదికవి పరమేశ్వరుని స్తుతించి, ప్రాచేతసుని పుత్రుడగు వాల్మీకిని కొలిచి, పరాశరుని కుమారుడగు వేదవ్యాసునికి నమస్కరించి, మనోజ్ఞ మయిన కవితా తీరము చేరిన సత్కవుల నెల్లరును ప్రణుతించెదను.

పరమేశ్వరుని ప్రపంచ సృష్టిలో, కళా ప్రకటనలో, విశ్వస్ఫృహలో, శబ్ద వికాసములో, మానవమాత్రుల కవితాసృష్టి, కళావ్యక్తిత్వము, సామాజికస్ఫృహ, వాగ్విన్యాసము ఏపాటివో ఊహింపవచ్చును. ఇంకను వేదము లాయన ముఖ నిర్గతములు. కనుక ఆయనయే ఆదికవి. కవి చక్రవర్తి కూడ. వాల్మీకి నన్నయాదు లాద్యులైనను, ఆద్యు డాయనయే.

## ఆముఖము

ఉ॥ తత్పద లక్ష్యముం బరమధర్మ మనంత మనాది సత్య సం
విత్పరిపూర్ణము న్నిగమ వేద్యము నిర్మలమున్ స్వతంత్రమున్
సత్పురుషార్థమున్ సకల సారము పారమునైన బ్రహ్మమున్
దత్పరినిష్ఠమౌ జగతి ధారణచేసి, తరింప నెంచెదన్॥ 8

"తత్" అనుపదమునకు లక్ష్యమైనట్టిదియు, శ్రేష్ఠమగు ధర్మమైన దియు, తుదిమొదలు లేనిదియు, సత్యజ్ఞానములచే పరిపూర్ణమైనదియు, వేదములవలన తెలియదగినదియు, శుద్ధమైనదియు, – అనగా ఆణవ మాయిక కార్మికమలములు లేనిదియు, ఇంద్రియాదుల సహాయము నపేక్షింపక సకల కార్యముల చేయగల్గుటచే స్వతంత్రమైనదియు, ధర్మార్థ కామమోక్షము లనియెడి నాలుగు పురుషార్థములలో విశిష్టమగు మోక్ష రూపమైనదియు, సకలమునకు మూలమైనదియు, అన్నిటికి హద్దు అయినదియు అగు బ్రహ్మమును, ఆ బ్రహ్మ పదార్థము చేతనే నిలువబడిన ప్రపంచమున నిలిచి, తెలిసికొని తరింప దలచెదను.

సృష్టికి పూర్వము నామ రూపములు కాని, తనకంటె వేఱయిన మఱొక పదార్థము కాని లేక ఒకటే అయిన "సత్" పదార్థమే, సృష్టి

తరువాత "తత్" అను పదముచే చెప్పబడుచున్నది. అదే బ్రహ్మ పదార్థము. "నిత్యం విభుం సర్వగతం", "నిత్యో నిత్యానాం", "సర్వం హ్యేతద్బ్రహ్మ" అనెడి శ్రుతిప్రమాణమువలన బ్రహ్మము దేశ కాల వస్తువులచే విభజింపరాని దయినందున అనంతమును, సృష్టికి పూర్వమునుండి యుండుటచే అనాదియు అని తెలియవలెను.

ఇక తనను గూర్చిన ఎఱుకను (ఆత్మజ్ఞానమును) మఱుగు పఱచు దోషము ఆణవ మలము. అణువుల చేరికవలన యేర్పడిన శరీరమే నేనను భ్రాంతి కలుగుటచే దీనివలన ఆత్మ నవలోకించు సామర్థ్యము లోపించును. పరతత్త్వజ్ఞానవాసన నెన్నటికి కలుగనీయక పాపకార్యములందు బుద్ధిని ప్రవేశపెట్టు దోషము మాయికమలము. ఇది మాయచే కలుగును. దేనివలన గురువులు బోధించిన పరమార్థమందు బుద్ధి ప్రసరింపక, మరో జన్మకు కారణ మగుచుండునో, అది కార్మికమలము. తా నొనర్చిన కర్మల ఫలముగా అది యేర్పడును.

భేదబుద్ధిని తెలుపు శక్తివిశేషము మాయ. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"- తైత్తిరీయము. "సత్యత్వం బాధరాహిత్యం"- వేదాంత పంచదశి. సత్యము జ్ఞానము అనంతము అయినది బ్రహ్మ. సత్యమనగా బాధ లేనిది. బాధకు లేమి అని అర్థము కనుక లేమిలేకుండుటయే సత్యము.

ఉ॥ సత్తనికాక, కేవల మసత్తనరాక, వియత్తు గాక, రూ
పెత్తని రేవగళ్ళ వహియించుచుఁ దా నమృతంబొ మర్త్యమో
యు త్తెఱగున్ వచింప మది కందక, గాఢ తమోపగూఢ లో
కోత్తర దివ్యతేజముగ నుంట స్మరించెద స్వస్వరూపమున్॥ 8

సృష్టికి పూర్వముగల స్వరూపము, సత్తనికాని అసత్తనికాని అంతరిక్షమనికాని పల్కుటకు వీలుపడనియట్లు, కాలమును తెలుపు రేలు పగళ్ళు ఏర్పడని స్థితిలో, నశింపనిది (అమృతము) నశించునది (మర్త్యము) అను భేదము లేక చీఁకటి కౌగిలింతలో ఒదిగిన దివ్యతేజముగ నుండుట స్మరించెదను,

ఋగ్వేదమున మహర్షులు సృష్టికి పూర్వ ముండిన స్థితిని గూర్చి చక్కగా చర్చించి, సర్వాంతర్యామియైన పరబ్రహ్మము సత్తు-అసత్తు, ప్రకాశము-అంధకారము, అమృతము-మర్త్యము, అను దంద్వముల కతీతమై యున్నట్లును, ఆదియందే తుచ్ఛము (అసత్యమగు మాయ)చే ఆవరింపబడి, తదేకముగ నుండినట్లును, "నాసదీయ సూక్తమున" ఇటు ప్రవచించిరి.

"నా స దాసీ న్నోస దాసీ త్తదానీం
నాసీ ద్రజో నో వ్యోమా పరోయత్
కిమావరీవః కుహకస్య శర్మ
న్నంభః కి మాసీ ద్గహనం గభీరమ్॥
నమృత్యు రాసీ దమృతం న తర్హిః
న రాత్ర్యా అహ్న ఆసీ త్ప్రకేతః
ఆనీ దవాతం స్వధయా తదేకం
తస్మా ద్ధాన్య న్న పరః కించ నాస॥
తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే
ప్రకేతం సలిలం సర్వమా ఇదం
తుచ్ఛేనా భ్వపిహితం య దాసీత్
తపస స్తన్మహినాఽజాయతైకమ్॥

ఇచట ప్రకేతములనగా సాధనములు. ఆనీత్ యందలి ఆన్ ధాతువునకు శ్వాసోచ్ఛ్వాసములు చేయుట లేక స్ఫురణను పొందుట అని అర్థము. స్వధయా=స్వీయమగు శక్తిచే; ఆభువు=1. జలము 2. బ్రహ్మము; తుచ్ఛము=మాయ; తపస్సు=జ్ఞానమయమగు విలక్షణశక్తి.

ఉ॥ తత్త్వ మగాధ మౌట, గుణతత్త్వతతన్ రఘురామమూర్తియౌ
తత్త్వమునే భజింతుఁ, గవితా వ్యపదేశమునం దదీయమౌ
తత్త్వము, వ్యక్తమైన పరతత్త్వము, విశ్వ సమంత భాసమౌ
తత్త్వము, నేనయైన తొలి తత్త్వము, నీవని పల్కరించెదన్॥ 1

పరబ్రహ్మతత్త్వము సులభముగ అర్థమగునది కాదు. అందుచే గుణసంబంధమువలన రఘువంశమున రామమూర్తిగా అవతరించిన శ్రీరామ తత్త్వమునే సేవింతును కవితయనెడి నెపమున ఆయన (శ్రీరాముని) స్వభావమును, ప్రకటితమైన ఆత్మతత్త్వమును, విశ్వమంతటను సమముగా వ్యాపించి ప్రకాశించు గుణమును, నేనే అయిన మొదటి రూపమును, "నీవ"ని సంబోధింతును.

శుద్ధబ్రహ్మము గహనము (ఎఱుగరానిది) గభీరము (లోతైనది) అయినప్పటికిని, సత్త్వ రజ స్తమో గుణముల కలయికవలన (ప్రకృతి సంబంధమువలన) నామ రూపముల పొంది, మనస్సుకు వాక్కుకు కొంత వఱకు గోచరమగుచున్నది. ఇది ప్రజ్ఞాన బ్రహ్మము. దీనినే సగుణ బ్రహ్మమనియు, ప్రకటిత పరబ్రహ్మ తత్త్వమనియు చెప్పుదురు. సంకల్ప మాత్రమున, మహాప్రకృతియనబడు అభిన్న శక్తిచే, విశ్వమును సృష్టించి ప్రకాశించున దీ తత్త్వమే. శ్రీరాముడు, గుణయోగమున కల్గిన ఈ ప్రజ్ఞానబ్రహ్మమని తెలియవలెను. గ్రంథ మంతటను శ్రీరాము నుద్దేశించియే నీవను శబ్దము ప్రయోగింపబడినది.

ఉ॥ నీదగు సృష్టికామన ధ్వనింపని స్పందనరూప శబ్దమై
యాదిమ హేతువై, యచలమౌ శివతత్త్వవినిర్గతాంశమై
ప్రోదియొనర్పఁ దత్ప్రణవమూల సరస్వతి శబ్ద మర్థమై
పాదుకొనంగ, సృష్టియు నుపాధుఁ గల్గెడె కారణుడుఁ దే॥ 10

"సో౽కామయత బహుస్యాం ప్రజాయే యేతి।
స తపో౽తప్యత। సతప స్తప్త్వా। ఇదగ్ంసర్వమసృజత॥"
-తైత్తిరీయ బ్రహ్మవల్లి.

సృష్టి చేయవలెవనెడి నీ కోరిక అచలమైన నీ శివతత్త్వము నుండి కేవలము ధ్వనింపని స్పందనరూప శబ్దముగా- సరస్వతిగా- (సరస్ ధాతువు) కదలికకలది లేక ప్రవాహరూపిణియైన శక్తిగా-పరావాగ్రూప మును పొంది (శబ్దబ్రహ్మమై), మానవునియందు 1) ఎఱుగునది (శబ్దము లేక ప్రమాత్రి) 2) ఎఱుగతగినది (అర్థము లేక ప్రమేయము) (3 ఎఱుక (జ్ఞానము లేక ప్రత్యయము) అను పేర్లతో నామ రూపమయ

మైన ప్రపంచము నేర్పఱచినది. అందుచేతనే ప్రపంచమును "శబ్ద ప్రభవ"గ శ్రుతి పల్కుచున్నది. "శబ్దేన వినా రూపం న ప్రకాశతే" శబ్దము లేక రూపము తెలియబడదు.

ఈ శబ్దబ్రహ్మము సర్వభూతములలోగల చైతన్యమే.

"చైతన్యం సర్వ భూ తా నాం శబ్దబ్రహ్మేతిమేమతిః।
తత్ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహమధ్యగాం। వర్ణాత్మ నావిర్భవతి గద్యా పద్యాతి భేదతః।"– శారదా తిలకం

ఇది సవితృశక్తియుక్తమై స్పందించి, కారణ సూక్ష్మస్థూల రూపముల పొంది, సమష్టిగా ఈశ్వర హిరణ్యగర్భ విరాట్ నామములతోడను, వ్యష్టిగా ప్రాజ్ఞ తైజస విశ్వ సంజ్ఞలతోడను, విరాజిల్లుచున్నది. పరమేశ్వరుని సృష్టికామన స్పందనముతోకూడిన మూలప్రకృతియే కనుక, ఆయన కంటె భిన్నము కాదు.

"సృష్ట్యున్ముఖ పరమశివ ప్రథమోల్లాస మఖండోఽవ్యక్తోనాద బిందుమయ ఏవ వ్యాపకో బ్రహ్మాత్మక శ్శబ్దః" శారదా తిలకమునకు రాఘవభట్ట వ్యాఖ్యానము.

నిష్పందము నిష్క్రియము అమనస్సు అశబ్దము ఆనందము అయిన చిత్తు, ఉపాధితో కూడి, ద్వంద్వ రూపమును దాల్చి, మనస్సుగను విషయము(వస్తువు)గను, ఏర్పడినది. భూత భౌతికమైన ఉద్ధత శక్తియే మనస్సు. అది సమాధియందు తప్ప ఎప్పుడును భావనాత్మకముగనే యుండును.

అపంచీకృత (ఐదు రూపముల పొందని) తన్మాత్రయొక్క సాత్త్వికాంశము ఇంద్రియముగను, తామసికాంశము వస్తువుగను ఏర్పడినది. వస్తువుయొక్క స్పందనము మనస్సుయొక్క ప్రతిస్పందనము(వృత్తి) వలన ప్రత్యయము లేక ఎఱుక కలుగుచున్నది. ఇంద్రియముల పరిధిలో, ఈ పరాశబ్దమే చెవికి మనస్సునకు సోకినపుడు శబ్దముగను, కంటికి మనస్సునకు తగిలినపుడు, రూప వర్ణాదులుగను, రూపొందుచున్నది.

## సమష్టి రూప పరిశీలనము.

సమష్టియందు సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, అంతర్యామిత్వాది గుణములు కలవు.

| దేహము 1 | పరమేశ్వరాంశము 2 | ప్రత్యయము (ఎఱుక) 3 | ప్రమాత్రి (ఎఱుగునది) 4 | ప్రమేయము (ఎఱుగతగినది) 5 | సృష్టి 6 | విశేషాంశములు 7 |
|---|---|---|---|---|---|---|
| 1. కారణ దేహము | మాయాశక్తితో కూడిన ఈశ్వరుడు లేక అంతర్యామి (శుద్ధసత్త్వసంభవుడు) | 1. ఆనందమయమైన స్వరూపజ్ఞానము, 2. సృష్టికల్పన (Cosmic ideation) | బిందు రూపమైన పరాశబ్దము. ఇదే తొలిస్పందనము. ఋషులు దీనిని ఓంకారముగ దర్శించిరి. | శక్త్యుల్బణము లేక ప్రకృతిపై కల్గిన ఒత్తిడి (Cosmic Stress) | భూతసృష్టి. (ఈశ్వరుడు ఈశ్వరుడుగా చేసినసృష్టి) 1. అపంచీకృత తన్మాత్రలు 2. ఇంద్రియములు 3. ప్రాణములు 4. అంతఃకరణము 5. స్థూల భూతములు. | ఈశ్వరునికి సంబంధించి ప్రత్యయ, ప్రమాత్రి, ప్రమేయములు ఒకటే కాని ప్రత్యేకములు కావు. |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2. సూక్ష్మ దేహము | హిరణ్యగర్భుడు లేక సూత్రాత్మ (శుద్ధసత్త్వ సంభవుడు) | 1. సమష్టి, సూక్ష్మ, స్థూల దేహములకు, 2. సృష్టి కల్పనకు సంబంధించినది. | శబ్దతన్మాత్ర. (మధ్యమ) ఇది శబ్దము యొక్క సహజ ధ్వని. మిక్కిలి సూక్ష్మమైనది. | సమష్టి సూక్ష్మ స్థూల దేహములు | భౌతిక సృష్టి (ఈశ్వరుడు ఈశ్వరుడుగా, తొలుత కావించిన తత్త్వముల (categories) సమ్మేళనమున కలిగిన సృష్టి) | — |
| 3. స్థూల దేహము | విరాట్టు (సూర్య చంద్ర అగ్న్యాది దేవతలతో, దానవ మానవాదులతో, కూడిన పదునాల్గు లోకములరూపము. శుద్ధసత్త్వ సంభవుడు). | 1. సమష్టి స్థూల తత్త్వమునకు 2. సృష్టికల్పనకు సంబంధించినది. | వైఖరి అనగా పరా, పశ్యంతి, మధ్యమా శబ్దములు గాక, సూక్ష్మ స్థూలములు అయిన వివిధ ధ్వనులు. | సమష్టి స్థూల దేహము | — | — |

## వ్యష్టి రూప పరిశీలనము

వ్యష్టియందు కించిత్‌జ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వము లుండును.

| అవస్థ | దేహము, స్థానము | పరమేశ్వరాంశము. | ప్రత్యయము (ఎఱుక) | ప్రమాత్రి లేక శబ్దము (ఎఱుగునది) | ప్రమేయము లేక అర్థము (ఎఱుగతగినది) | విశేషాంశములు |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. సుషుప్తి (జీవుని ద్వంద్వ రహిత స్థితి) | కారణ శరీరము. స్థానము-హృదయము. | అవిద్యతో కూడిన ప్రాజ్ఞుడు. (మలిన సత్త్వ సంభవుడు) | సుషుప్తి సంబంధమైన ఆనందమునకు సంబంధించినది. | పరాశబ్ద విశేషము. (ఇందు ధ్వని యుండదు. జీవుని కారణ దేహ సంబంధమైన ఒత్తిడి మాత్ర ముండును. | వ్యష్టికారణ దేహము. ఇందు సంస్కారములు, మనోవృత్తులు, అంతర్లీనమై, రాబోవు జీవరూపములు బీజప్రాయముగ ఇమిడియుండును | ఈశ్వరుని యందువలె శబ్దార్థ ప్రత్యయములుమూడును ఒకటిగా నుండును |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2. స్వప్నము. | సూక్ష్మ లేక లింగ శరీరము. స్థానము–మనస్సు. | తైజసుడు. (మలినసత్త్వ సంభవుడు). | 1. సుఖ దుఃఖ సమ్మిళితమైన వ్యష్టి సూక్ష్మ దేహమునకు, 2. స్వప్నరూపమైన సృష్టి కల్పనకు, సంబంధించినది. | వైఖరీరూప శబ్దంయొక్క సూక్ష్మాంశము. నోటితో పలుకబడక యుండునది. | వ్యష్టి సూక్ష్మ దేహము. | జాగ్రత్ వాసనలతో కూడిన మనస్సు పనిచేయుచునే యుండును. |
| 3. జాగ్రత్ (ఇంద్రియములచే విషయముల గ్రహించు స్థితి). | స్థూల శరీరము. స్థానము–దృష్టి. | విశ్వుడు (మలిన సత్త్వ సంభవుడు) | వ్యష్టి స్థూల దేహానుభవమునకు, 2) జాగ్రత్ సృష్టికల్పనకు, చెందినది. | అక్షరములతో కూడిన వాక్కులు, లేక వర్ణములతో నిమిత్తము లేని ధ్వనులు. (వైఖరీవాక్కు) | వ్యష్టి స్థూల దేహము. | సంస్కారములబట్టి ఇచ్ఛాదులు వానినిబట్టి జరుగు కార్యములు. |

శా॥ అవ్యక్తంబయి సృష్టి కావల, ననాద్యంతంబు నిత్యంబునై
భవ్యంబౌచు, మహత్వ తత్త్వముగ భావ్యంబై, యహంకారమై,
ద్రవ్యంబై, గుణపంచకంబు నయి, భూత వ్యాప్తమై, యింద్రియా
ది వ్యక్తంబగు తత్త్వరూపమును నేఁ దెల్పన్ సమర్థుండనే! 11

"బ్రహ్మణోఽవ్యక్తః అవ్యక్తాన్మహతః మహతోఽహంకారః
అహంకారాత్పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచమహా
భూతాని పంచమహాభూతేభ్యోఽఖిలంజగత్॥" -శ్రుతి.

సృష్టికి పూర్వము వ్యక్తముకాక, ఆదియు అంతములేక, ఇది ఇట్టిదని తెలియుబడని మూలప్రకృతి రూపాంతరముచెంది, సత్వోద్రిక్తము వలన అవ్యక్తమనెడి ఆవరణశక్తిగను, అవ్యక్తమునుండి రజోద్రేకము వలన మహత్తు అనెడి విక్షేప (కదులునట్టి) శక్తిగను, మహత్తునుండి అహంకారముగను తోచి, వస్తురూపమున మనస్సు బుద్ధి చిత్తము అనెడి అంతఃకరణముగను, శబ్దము స్పర్శము రూపము రసము గంధము లనెడి తన్మాత్రలుగను, పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశములనెడి పంచభూతములుగను, త్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వ ఘ్రాణములను జ్ఞానేంద్రియములుగను, వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థలనెడి కర్మేంద్రియములుగను, వ్యక్తమగు నీ స్వరూపమును అనగా చేతనను (లోని పదార్థమును తెలుపు చిత్తవికాస రూపమగుశక్తిని) వివరింప నేను సమర్థుడను కాను.

అవ్యక్తమున ఈశ్వర చైతన్యము ప్రతిబింబితము కాగా, మహత్త్వమున హిరణ్యగర్భుడు, అహంకారమున సర్వ స్థూల పాలకుడైన విరాట్టు కల్గిరి. అంతఃకరణము, గుణములు (తన్మాత్రలు) మహత్తునుండి (Cosmic Buddhi) కలుగగా, వైకారిక, తైజస, భూతాది అను మూడు రూపములలో సాత్త్విక రాజస తామసమైన అహంకారము రూపొందినది.

శివ శక్తుల సామరస్యము వికృతము (భంగము) అగుటచే కల్గిన అహంకారము వైకారికము. దిక్కులు, వాయువు, అర్కుడు, వరుణుడు,

అశ్వినులు, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మిత్రుడు, చంద్రుడు అను ఇంద్రియాధిష్ఠాన దేవతలు, ఈ వైకారికాహంకారము నుండి పుట్టినవారే. తైజసాహంకారము నుండి ఇంద్రియములును, భూతాద్యహంకారమునుండి పంచ తన్మాత్రలును పంచభూతములును కల్గినవి. వ్యష్టి దేహమున గల ఇంద్రియములు సమష్టి దేహమున ఇంద్రియాధిష్ఠాన దేవతలైనవి. "ఇంద్రియ వ్యపదేశేన వ్యాచక్షంతే తాశ్చ దేవతాః" జ్ఞానవాశిష్ఠము.

శబ్దతన్మాత్రనుండి ఆకాశము; శబ్దముతోకూడిన స్పర్శతన్మాత్ర నుండి వాయువు; శబ్ద స్పర్శలతో కలిసిన రూపతన్మాత్రనుండి అగ్ని; శబ్ద స్పర్శ రూపములు పొందిన రసతన్మాత్రనుండి జలము; శబ్ద స్పర్శ రూప రసములచే ఒప్పు గంధ తన్మాత్రనుండి పృథివి కలిగినవి. పంచ భూతములకో కూడ వర్ణము లేర్పడినవి. ఆకాశము స్వచ్ఛము (Tran$parent), వాయువు నలుపు, అగ్ని ఎఱుపు, జలము తెలుపు, పృథివి పసుపు.

అంతఃకరణములో సంకల్ప వికల్పాత్మకమైనది మనస్సు. నిశ్చయాత్మకమైనది బుద్ధి. చలనస్మృత్యాత్మకమై, విషయచింతనము చేయునది చిత్తము. నేను నాది అనుభావములకు మూలమైనది అహంకారము. ఇచ్ఛాశక్తి ప్రధానమైనది అంతఃకరణము కాగా, జ్ఞానశక్తి విశిష్టమయినవి జ్ఞానేంద్రియములు. క్రియాశక్తి ప్రముఖమైనవి కర్మేంద్రియములు. ఇట్లు ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తులవలన బ్రహ్మాండ పిండాండములు సిద్ధించిన క్రమమును చూడుడు.

ఇంద్రియములు, అధిష్ఠాన దేవతలు.

| | |
|---|---|
| మనస్సు – చంద్రుడు | జిహ్వేంద్రియము – వరుణుడు |
| బుద్ధి – చతుర్ముఖుడు | ఘ్రాణేంద్రియము – అశ్వనీదేవతలు |
| చిత్తము – క్షేత్రజ్ఞుడు | వాగింద్రియము – చతుర్ముఖుడు |
| అహంకారము – రుద్రుడు | పాణీంద్రియము – ఇంద్రుడు |
| త్వగింద్రియము – వాయువు | పాదేంద్రియము – ఉపేంద్రుడు |
| చక్షురింద్రియము – సూర్యుడు | పాయ్వింద్రియము – మృత్యువు |
| శ్రోత్రేంద్రియము – దిక్కులు | ఉపస్థేంద్రియము – ప్రజాపతి. |

## బ్రహ్మాండ పిండాండముల సమన్వయము

| బ్రహ్మాండమున లోకములు | పిండాండమున చక్రములు | అధిష్ఠాన దేవత | భూతాది | తన్మాత్రలు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| సత్యలోకము | సహస్రారము | పరమశివుడు | మనస్సునకు విషయమునకు అతీతమైన స్థానము | |
| 1. మహర్లోకము – | ఆజ్ఞాచక్రము | శంభుడు (శివశక్త్యాత్మకుడు) | మనస్సు | — |
| 2. తపోలోకము – | విశుద్ధచక్రము | సదాశివుడు (అర్ధనారీశ్వరుడు) | ఆకాశము | శబ్దము |
| 3. జనలోకము – | అనాహత చక్రము | ఈశుడు | వాయువు | శబ్ద స్పర్శలు |
| 4. స్వర్లోకము – | మణిపూర చక్రము | రుద్రుడు (త్రిశక్తిసంయుత మూర్తులు) | అగ్ని | శబ్ద స్పర్శ రూపములు |
| 5. భువర్లోకము – | స్వాధిష్ఠాన చక్రము | విష్ణువు | జలము | శబ్ద స్పర్శ రూప రసములు |
| 6. భూలోకము – | మూలాధార చక్రము | బ్రహ్మ | పృథివి | శబ్ద స్పర్శ రూప రస గంధములు. |

శా॥ శుద్ధంబైన త్వదీయతత్త్వగతమౌచుం దొల్త నిచ్ఛాదుల
న్నద్ధంబై, త్రిగుణాద్యవస్థలఁ బ్రధానంబైన నీ మాయచే
సిద్ధింపన్ జగముల్ రహింతువు కదా! క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁడ
న్బుద్ధిం ద్వప్రకృతి ద్వయంబునకుఁ గైమోడ్తున్ సహాభక్తిమై॥12

శుద్ధ బ్రహ్మమైన నీయందే ప్రకాశించుచు, మొదట ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుగా పైకుబికి, వాని స్థూల రూపములేయగు సత్త్వ రజ స్తమము లనెడి త్రిగుణములవలన ప్రముఖమైన నీ మాయచే లోకములు సిద్ధింపగా (ఎట్లో ఇదివఱకే తెలుపబడినది) అందే నీవు అంతర్యామిగా ప్రవేశించి ఆనందింతువు. ఇట్లు జగము జగదాత్మ రెండును నీవే అయిన నీ ప్రకృతి ద్వయమునకు భక్తితో నమస్కరింతును.

శాంతవృత్తి సత్త్వగుణము. కామ క్రోధాదులతో మనస్సును క్షోభింపజేసెడి ఘోరవృత్తి రజోగుణము. మూఢవృత్తి తమోగుణము.

"తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి। తదపోఽసృజత"
—ఛాందోగ్యము

"బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యాభిధేయ మాశ్రిత్య లోకాన్
సృష్ట్వా ప్రవిశ్యాంతర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ
నియంతృత్వా దీశ్వరః। జీవ ఇతిచ।"—నిరాలంబోపనిషత్తు

పరమాత్మ సృష్టిచేయ సంకల్పించి, తన మాయను చూచెను. ఆ మాయాశక్తి సృజించెను. పరబ్రహ్మమే తన శక్తియైన ప్రకృతి అను పేరుగలదానిని ఆశ్రయించి, లోకముల సృష్టించి, అందు అంతర్యామిగా ప్రవేశించెను. పిమ్మట బ్రహ్మాదులను ఇంద్రియవృత్తులందు నియమించుట ద్వారా ఈశ్వరు డయ్యెను. జీవుడుకూడ ఇతడే! బ్రహ్మము శక్తిని ఉపాధిగపొంది ఈశ్వర దేహముగా ప్రకాశించుటచే శరీరమును శరీరియు అదియే కాని ఇతరము కాదు.

"తచ్ఛక్త్యుపాధిసంయోగా ద్బ్రహ్మైవేశ్వరతాంవ్రజేత్"-వేదాంతపంచదశి

ఈ శరీరమును క్షేత్రమనీ, శరీరిని (క్షేత్రమును తెలిసికొనిన వాడు) క్షేత్రజుడని, చెప్పుదురు.

"ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విధః"
-భగవద్గీత.

బ్రహ్మాండమున క్షేత్రము ప్రపంచము, క్షేత్రజ్ఞుడు ఈశుడు కాగా పిండాండమున క్షేత్రము శరీరము, క్షేత్రజ్ఞుడు జీవుడు అగుచున్నాడు. అఖండాకార పరబ్రహ్మము అండము (గుడ్డు)గా ఏర్పడినది బ్రహ్మాండము. పిండము (శరీరము) కోశముగా గల్గినది పిండాండము. మొదటిది సమష్టి రూపము కాగా, రెండవది వ్యష్టి రూపము.

ఉ॥ శక్తి జనించు సర్వమును శక్తి పియుక్తి శమించు, నైనం ద
చ్ఛక్తికి నీ కభేదమని స్వాంతమునం దలపోసి, యిప్డు సు
వ్యక్త జగత్సమూహమున వ్యాప్తము నౌ భవదీయశక్తి నా
సక్తి నుతింతు మాయ విడ, సంవిదనూనవిశేషలబ్ధికై॥ 13

శక్తివలన సర్వము పుట్టుచున్నది. అది తొలగినపుడు శమించు చున్నది. ఈ శక్తి నిరంతరము పరమేశ్వరుని వీడని స్వేచ్ఛమైన శివకామము. చరాచరమైన సకల ప్రపంచమునకు బీజము.

"ఇచ్ఛా శైవ స్వచ్ఛా సంతత సమవాయినీ సతీ శక్తిః
సచరాచరస్య జగతో బీజం నిఖిలస్య నిజ నిలీనస్య"-
తత్త్వసందోహం

కనుక సృష్టికి శక్తి (మూలప్రకృతి) తల్లియు, ఈశ్వరుడు తండ్రియు, అగుచున్నారు. "నాకంటె అన్యముగాక మహాద్బ్రహ్మమని పిలువబడు చున్న నా మాయయే జగత్ సృష్టికి హేతువు కనుక, అది యోని. అనగా జన్మస్థానము. పరమేశ్వరుడనగు నేను బీజప్రదుడను" అని గీతా ప్రవచనము.

"మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దదామ్యహం
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత.
సర్వ యోనిషు కౌన్తేయ! మూర్తయః సంభవంతియాః
తాసాం బ్రహ్మమహద్యోని రహం బీజప్రదః పితా"- భగవద్గీత.

ఇట్లు శక్తికి నీకును అభేదమని భావించి, ఇప్పుడు జగత్సమూహములను వ్యాపించిన నీ చిద్రూపశక్తిని నన్నావరించిన అజ్ఞానము తొలగుటకును జ్ఞానము కలుగుటకును ఆసక్తితో నుతింతును.

మాయ అనగా ఉన్నట్లు కనుపించి, విమర్శించి చూడగా లేనిది. "యా మా సా మాయా". మఱియు "మాయాచ తమో రూపా"- పూర్వోత్తర తాపన్యుపనిషత్తులు. మాయ తమోగుణ స్వరూపమైనదని భావము. చిదానందమయమైన పరబ్రహ్మము ప్రతిఫలించుటతో, గుణసామ్యావస్థలో నుండిన మూలప్రకృతి, "మాయ" యని, "అవిద్య" యని రెండు విధములయినది. సత్త్వ ప్రకాశము కలిగి శుద్ధమైనది మాయ. ఇతర గుణములతో కలియుటచే మలినమైనది అవిద్య.

"చిదానందమయ బ్రహ్మప్రతిబింబ సమన్వితా
తమో రజ స్సత్త్వ గుణా ప్రకృతి ర్ద్వివిధా చ సా॥
సత్త్వ శుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయాఽవిద్యే చ తే మతే॥"
-వేదాంత పంచదశి.

ఈశ్వరుని మాయయు, జీవుని అవిద్యయు ఆవరించియున్నవి.

ఉ॥ కర్మజ పుణ్య పాప ఫల కాండములన్ హరియించు నీదు జ్యో
తిర్మయ మండలంబుల మదిం గనుపించుత నాత్మరూప మం
తర్ముఖమైన దృష్టిని సదాహరిచందన శీతలంబుగా
శర్మద సుందరంబుగఁ బ్రశాంత గుణక్షుభితామృతాబ్ధిగా॥ 14

కర్మలవలన కలుగు పుణ్యపాపఫలసమూహముల పోజేయు నీ తేజోమయ మండలములందు వెన్నెలవలె చల్లనైనదియు, సౌందర్యోపేతమై ఆనందమైనదియు, త్రిగుణములచే క్షోభించి శాంతించిన అమృతసాగర మైనదియు, అగు ఆత్మరూప మగుపించునుగాక!

శరీరమందలి షట్చక్రము లన్నియు తేజోమయములే. అందు మూలాధార స్వాధిష్ఠానములు అగ్నిమండలము. మణిపూర అనాహతములు సూర్యమండలము. విశుద్ధి ఆజ్ఞాచక్రములు చంద్రమండలము.

ఈ చక్రమము లాజీటియందును కుండలినీశక్తి (మహాత్రిపురసుందరి) భిన్న రూపములతో తోచుచున్నను, తన స్థూల సూక్ష్మ రూపములతో ప్రమేయము లేక స్వరూపమైన చిదానందముతో, సహస్రారమండలి బైందవ స్థానమున క్రీడించుచుండును. అట్టి స్వరూపమును (ఆత్మను) అన్ని మండలములలో దర్శింపజేయుమని ఆకాంక్ష.

పుణ్యపాపములు, వానిని అనుభవించుటకు అనుకూలములగు జన్మములు, జీవి యొనర్చు కర్మలబట్టియే కలుగుచున్నవి. ఆత్మకు వీనితో ఎట్టి సంబంధము లేదు. ఒకే వ్యక్తి గోడను కట్టునపుడు క్రమముగా ఉన్నతిని (పైస్థాయిని), బావిని త్రవ్వునపుడు అధోగతిని (క్రింది స్థాయిని) పొందుట ఎల్లరకు తెలిసినదే కదా! అసలు ఉపాధి (శరీరము) లేనిచో కర్మము లేదు, కర్తయు లేడు. అనుభవము శూన్యము. అవిద్యచే ఆవృతుడై, ఉపాధిని (ఆవరణము) పొందిన జీవునిచేత, త్రిగుణములు వాని వాని ప్రాబల్యములబట్టి, కర్మల చేయించుచున్నవి. సత్త్వ ప్రాబల్యమున సత్కర్మ, తమః ప్రాచుర్యమున దుష్కర్మ కలుగును. ఆ కర్మఫలము నశించునపుడు సాక్షాత్తు ముక్తుడే.

అంతర్ముఖుడై ఆత్మావలోకనము చేయువాని కర్మఫలములు నశించు ననియు, అతడు నిరంతరము సచ్చిదానంద స్వరూపమైన ఆత్మయందే ఆనందించు నిత్యముక్తుడనియు భావము.

శా॥ వాగర్థంబుల వోలె నామములు రూపంబుల్ సుధాత్యంబులై
రాగం బేర్పడ, సృష్టిఁగూర్చి, తను విశ్రాంతిన్ సుధారాశిపై
భోగిశాన శయుండవౌచు, సకలంబున్ నీవయై తోఁచు, త్వ
ద్యోగానంద మయూఖ మాలికల నే నూహింప యత్నించెదన్॥ 15

వాక్కు దాని అర్థము వలె నామములు రూపములు ధరింపతగినవి కాగా, సృష్టి సంబంధమైన కోరిక కలుగగా, లోకముల సృజించి, సేద దీరుటకు పాలకడలిపై శేషతల్పమున శయనించి, స్వరూప విశ్రాంతిని (ఆనందమును) అనుభవించుచు, అంతటను నీవే కన్పింప, నీ యోగానంద కిరణముల చాలులను ఊహించుటకై నేను యత్నింతును.

క్షీరసాగరము, శేషతల్పము, విష్ణువు కూడ శుద్ధసత్త్వరూపముగు పరిజ్ఞానబ్రహ్మమే. అనగా అచలము అశబ్దము నిర్గుణము కాని బ్రహ్మము. (Active Brahman) విష్ణువు శేషశాయి. శేష అనగా మిగిలినది. ప్రళయమునన్నీ సర్వము నశింపగా మిగిలినది. అనగా శుద్ధ సత్త్వమే. దానిపై శయనించిన విష్ణువు కూడ సర్వవ్యాపకమైన శుద్ధసత్త్వమే. ఆయన బొడ్డునుండి పుట్టిన తామర తీగ రజోగుణ ప్రధానమైన సంకల్పము (సృజనేచ్ఛ). బొడ్డు తామరలో ఉదయించిన చతుర్ముఖ బ్రహ్మను మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ( అంతఃకరణ చతుష్టయము) ముఖములుగా గల జీవుడు. ఇట్లు జీవునిలోగల ఈశ్వరాంశముతో సహా సకలమందు బ్రహ్మపదార్థమే కలదనుటకు వేరొక నిదర్శన మెందులకు ?

సర్వమును ఆవరించి లేక చుట్టియున్న బ్రహ్మరూపశక్తిని పురుషునిగా భావించి, సర్వమును భరించు అనంతునిగా చెప్పుదురు. ఈ అనంతుడే ఇందలి భోగిశాయుడు. అనంత శయనుడు శుద్ధబ్రహ్మము,- శ్రీమన్మహావిష్ణువు. ఇది సమష్టి కుండలిని విషయము. ఇక పిండాండమున వ్యష్టి కుండలినీశక్తి (మహాత్రిపురసుందరి) హవర్ణము. ఇది బ్రహ్మమగు అకారముతో కూడి "అహ" మై నామ రూప జగమును సృజించినది.

"శివశక్తి సంయోగాత్ జాయతే సృష్టికల్పనా"- శాక్త తంత్రము.
"అకారః సర్వ వర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః
ఆది రంత్యేన సంయోగా దహ మిత్యేవ జాయతే."

వాఙ్మయ మంతయు అకారాది హకారాంతములందు ఇమిడి ఉన్నది కదా! శక్తిరూపముగ వ్యక్తమైన వాక్కు (శబ్దబ్రహ్మము) శబ్ద అర్థ ప్రత్యయములుగా ఎట్లు పరిణామము చెందినదో ఇది వలనకే తెలుపబడినది. "న శివేన వినాదేవి న దేవ్యాచ వినా శివః నా నయో రంతరం కించిత్ చంద్ర చంద్రికయోరివ". కనుక శక్తి లేక శివుడు, శివుడు లేక శక్తియు లేనందున, వాగర్థములు ఒండొంటిని వీడవు. ఇట్టిదే యగు జీవేశ్వర యోగమువలన సమాధియందు కలిగెడు ఆనందమును భావింప యత్నింతును.

స్వ స్వరూపము కలవాడు ఈశ్వరుడు. ఆత్మేతర వస్తుజ్ఞానము కలవాడు జీవుడు. దృష్టియందే భేదము కాని వదార్థ మొక్కటే.

శా॥ శ్రీమాతా యన సంతసం బొదవునో, శ్రీకాంతుగాఁ బేర్కొనం
ప్రేమాధిక్యము గల్గునో, విధియనం బ్రీత్యర్థమై మించునో,
కామారాతి యటన్న నెమ్మనమునన్ గారాబ ముప్పొంగునో,
స్వామీ! నీ కెది యిష్టమౌఁ దెలుపవే ప్రార్థింతు నట్లే మదిన్॥ 16

ఓస్వామీ! శ్రీమాతా యనిన నీకు సంతోషమా? శ్రీకాంతా యనిన ఇష్టమా? బ్రహ్మయనిన ప్రీతియా? శివుడన్న ఆనందమా? నీకేది యిష్టమో తెలిపిన నిన్నట్లే సంబోధించి ప్రార్థింతును.

శాక్త వైష్ణవ వేదాంత శైవాది సంప్రదాయము లన్నిటియందు తెలుపబడిన తత్త్వ మొకటే అనియు, అది స్త్రీ కాదు, పురుషుడు కాదు, షండము కాదు, జడము కాదనియు [“నేయంయోషిత్ న చ పుమాన్ న షండో న జడః స్మృతః-”యామళము]అనేక నామములతో అనేకరూపము లతో తోచినను పరబ్రహ్మము ఏకైకము అభిన్న మనియు, విశేషించి శివ శక్తి కేశవాభిన్నత్వమే రాముని తత్త్వమనియు, కనుక క్రింది స్థాయిలో కల్పిగిన నామ రూపముల గూర్చి వివాదము కూడదనియు భావము.

శివుడు దేవి కేశవుడు అభిన్నమనుటకు రామరహస్యోపనిషత్తు నందలి ధ్యాన శ్లోకముల గమనింపుడు.

“రామం త్రినేత్రగం సోమార్ధ ధారిణం శూలినం పరం
భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దిన ముపాస్మహే.
రామాభిరామాం సౌందర్య సీమాం సోమావతంసకాం
పాశాంకుశధనుర్బాణ ధరాం ధ్యాయే త్రిలోచనామ్॥

ఇంకను “శ్రీరామ శ్శ్యామలా దేవీ, శ్రీకృష్ణో లలితాంబికా”, “కదంబ చిదాద్యా లలితాపుంరూపా కృష్ణవిగ్రహా” తంత్రరాజము. ఇట్టివచనములచే శ్రీరాముడు శక్తి స్వరూపుడే. మఱి రాముడు విష్ణుని అవతారము కదా యనిన శ్రీమహావిష్ణువే పరాశక్తియొక్క పురుష రూపమని విష్ణు వచనమే కలదు.

భోగే భవానీ రూపాచ, దుర్గా రూపాచ సంగరే,
కోపేతు కాళికా రూపా, పుంరూపా చ మదాత్మికా"

మఱియు "అహం దేవీ నచాఽ న్యోస్మి" అను పరమేశ్వర వచనము గమనార్హము.

శా॥ శ్రీరామాయ నమో యటంచు మదిలోఁ జింతించు, నష్టాక్షరీ
సారాసాదక, శైవమంత్రగత బీజవ్యాప్త సంపూర్ణమున్;
ఘోరాఘాభ్ర సమీరమున్, సుకృతమున్, గూటస్థమున్ శాంతమున్
స్వారాజ్యాధిక ముక్తి సౌధ వర సోపానమ్ము, నీ మంత్రమున్॥ 17

"మకారం మననంచైవ త్రకారం త్రాణ ముచ్యతే
మనన త్రాణ మిత్యాహు ర్మంత్ర మిత్యభిధియతే॥

మకారమునకు మనన మనియు, త్రకారమునకు త్రాణము (కాచుట) అనియు అర్థములు. మననము చేయువానిని కాపాడునది మంత్రము. అష్టాక్షరీ మంత్రము "ఓం నమో నారాయణాయ". శివమంత్రము "నమః శివాయ". ఈ రెండు మంత్రములలో "రా–మః" అనునవి బీజాక్షరములు. అవి లేనిదే ఆయామంత్రార్థములు వ్యతిరేకములగును. నారాయణ శబ్దమునకు సర్వాంతర్యామి అని అర్థము. అందు "రా" లోపించిన "నాయణ" అయి, సర్వాంతర్యామికానిది అని చెప్పవలసివచ్చును. అట్లే "నమః శివాయ"లో "మః" లోపింపగా నశివాయ – "శివము లేనిది – శుభము కానిది" అని యగును. కనుక అవి బీజాక్షరములు. ఆ రెండు బీజాక్షరములు చేరిక వలన "రామః" అయినది.

రాము డనగా రంజింపజేయువాడు. యోగులు ఆనందించు నిత్యానంద స్వరూపమగు పరబ్రహ్మము. ["రమంతే యోగినో యస్మిన్ నిత్యానందే చిదాత్మని। ఇతి రామపదే నైతత్ పరం బ్రహ్మాభిధీయతే॥" – పద్మపురాణము.] కనుక రామ అను బీజాక్షరముల సంపుటీకరణముతో నమః శబ్దము చేరి పరిపూర్ణమైనది. నమ శ్శబ్దమునకు నమస్కారమను సాధారణార్థమేగాక, త్యజించుచున్నాను అని అర్థముకూడ సాధ్యమయినందున,

శ్రీరామాయనమః అను మంత్రమునకు 1) శ్రీరామునికి నమస్కారము 2) శ్రీరామునికొఱకు సర్వమును త్యజించుచున్నాను అని అర్థములు చెప్పబడినవి.

ఇట్టి రామమంత్రము భయంకరములయిన పాప మేఘముల ఎగుర గొట్టు గాలివంటిది. చక్కగా ఏర్పఱుపఁబడినది. పుణ్యమైనది. పర్వత శిఖరము వలె ఉన్నతమైనది. కంసాలి డాకలివలె స్థిరమైనది. (డాకలిపై అనేక వస్తువులు రూపొందును కాని అది మారదు. అట్లే భగవంతుడు కూడ.) విశ్వసమూహముల తనయం దిమిడ్చుకొనినది. శాంతమైనది. స్వర్గముకంటె అతీతమయిన ముక్తి అనెడి సౌధమునకు మఱలు పొడపిన సోపానము వంటిది. ఇట్టి నీ మంత్రమును శ్రీరామాయనమః అని ధ్యానింతును.

మ॥ కలి దోషఘ్నము, జన్మతారకము, సౌఖ్యాపాదకంబున్, మహో
జ్వల దగ్న్యంబర వర్ణరూప యుతమున్, ప్రాగ్జన్మ సంస్కార సం
కలితంబున్, మధురాక్షరంబుఁ, త్రిజగత్కల్యాణ ధామంబునౌ
నిల నీ నామముఁ బ్రాకృతుం డెఱుఁగునే యెన్నెని జన్మంబులన్? 18

నీ పేరు కలి దోషమును హరించును. జన్మముల తరింపజేయును. సౌఖ్యము నొసగును. మిక్కిలి తేజోవంతములయిన అగ్ని(రా) ఆకాశ(మ) బీజాక్షరముల రూపము కలది. పూర్వజన్మ సంస్కారము వలన లభించినది. మధురములయిన అక్షరములు కలది. మూడు లోకముల శుభమునకు నిలయమైనది. ఇట్టి నీ నామమును ఎఱుక లేనివాడు ఎన్ని జన్మము లెత్తినను తెలిసికొన లేడు.

శా॥ నీ మంత్రార్థ మెఱుంగకే పలికినన్, నియంబు లోపించినన్,
వ్యామోహంబును గూల్చి శాశ్వత సుఖ ప్రాప్తిం బ్రసాదించుఁ, ద
త్సామర్థ్యంబున మూడు దేహములు నిష్పాపంబులై మించుటన్
భూమిం దావక నామమ ట్లితరముల్ మోక్షార్థము న్జూపునే. 19

నీ మంత్రము నర్థము తెలియక జపించినను, నియమముల పాటింపకున్నను, అది జీవియొక్క వ్యామోహమును నశింపజేసి, శాశ్వత

సుఖమును (మోక్షమును) ప్రసాదించును. ఆ నామ ప్రభావమువలన స్థూల సూక్ష్మ కారణ దేహములు శోధింపబడి, పాపరహితములగును. ఫలితముగా అందలి జీవులును - విశ్వ, తైజస, ప్రాజ్ఞులు-దోష విముక్తులగుదురు. నీ నామమువలె ఇతర నామములు మోక్ష ధనమును (బ్రహ్మమును) చూపజాలవు.

"రమయ తీతి రామః. రమంతే అస్మిన్ ఇతిరామః" రమింపచేయువాడు లేక ఆతనియందు రమింతురు గనుక రాముడు. సకల ప్రాణికోటి పరమాత్మయందే ఆనందించునుకదా! కనుకనే రామ శబ్దము పరమాత్మనే తెల్పును.

"రామ ఏవ పరం బ్రహ్మ రామ ఏవ పరం తపః
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో రామ తారకం" -రామరహస్యోపనిషత్తు

తెలియక జపించినను రామనామము ఫలప్రదమనుటకు నిదర్శనము వాల్మీకియే

శా॥ కాలాతీతునిఁ, గాల రూపుని, మహాకాలుం, గృపాళుం, బరుం
గాలాత్మున్ నిను సంస్తుతింప గలనే! కాలానుగామిన్ సదా
కాలాధీనుఁడఁ గాల శోధితుఁడ సంస్కారక్రియాశూన్యుఁడం
గాలానంత తరంగ బుద్బుద చలత్కాయుండఁ గై మోడ్చెదన్॥ 28

కాలమునకు అతీతుడవు. అఖండ కాలము స్వరూపముగ గలవాడవు. భవము లయింపజేయు మహాకాలుడవు. దయగలవాడవు. పరమేశ్వరుడవు. కాలమే ఆత్మగాగల నిన్ను, కాలము వెంట పోవునట్టియు, ఎల్లపుడు ఆవరణరూపమైన కాలముయొక్క అధీనమున నుండునట్టియు, కాలునిచే శిక్షింపబడునట్టియు, సత్సంస్కారములేనట్టియు, కాలముయొక్క అంతము లేని తరంగములందు నీటిబుడగ వలె చలించు శరీరము కలట్టియు నేను స్తుతించగలనా? నీకు నమస్కారము మాత్రము చేయుదును. దయతో నీవే నన్ను బ్రోవుము.

## అనుతాపము.

శా॥ నీ వున్నావని, నన్నుఁ బ్రోతువని యెంతే నాశ నే నీయెడన్
నా వృత్తాంత మొకింత దెల్పుకొనుదున్ నా స్వామి! యూలించి దు
ర్భావోద్వేగ నిపీడ్యమాన గుణసంపాతంబు వారింపవే,
గైవల్యంబు నొసంగ మద్దురిత సంఘంబున్ విదారింపవే॥ 21

ఓస్వామీ! నన్ను రక్షించుటకు నీవున్నావను ఆశతో ఇప్పుడు స్వవిషయమును కొంత నీకు మనవి చేసికొనుచున్నాను. నా మనవి నాలకించి చెడ్డ భావముల ఆవేశముచే బాధింపబడుచున్న గుణపతనమును నివారింపుము. నా పాప సమూహముల చీల్చివేసి మోక్షము నిమ్ము.

శా॥ ఈ ప్రస్థానమునందు నొంటరిగ నే నీ దుర్గమారణ్య మా
ర్గ ప్రక్రాంతుఁడనైతి సంచితము ప్రారబ్ధంబులం గొంచు, నేఁ
డప్రేక్ష్యంబు మదీయ దైన్యము; గృపాయత్తైక చిత్తుండవై
నీ ప్రాబల్యము చూప రమ్మిపుడు నిన్నే నమ్మికొంటిం ప్రభూ॥ 22

ఓప్రభూ! ఈ జీవితయాత్రలో చొరశక్యముకాని అడవిదారిని, నా సంచితమును ప్రారబ్ధమును తీసికొని ఒంటరిగ నడచుచున్నాను. నేడు నా స్థితి మిక్కిలి దయనీయమై చూడరానిదిగ నున్నది. నీవు దయార్ద్రహృదయుడవు. నీ గొప్పతనమును ప్రదర్శించి నన్ను రక్షించుటకు రమ్ము. నే నిపుడు నిన్నే నమ్ముకొన్నాను.

సంచితము – ఈ జన్మమున అనుభవించుటకు గతజన్మముల కూడపెట్టబడిన కర్మఫలము. కడచిన జన్మములనుండి వెన్నాడునది కనుక దీనిని మూట యనవచ్చును.

ప్రారబ్ధము – దేనివలన మఱియొక జన్మ మెత్తవలసి యుండునో ఆ కర్మవిశేషము. ఇది ప్రస్తుత జన్మమునుండి ప్రారంభమగును. దీని ఆధారమున మఱియొక జన్మమునకు పోవుదుము. కనుక దీనిని కట్ట యనదగును.

శా॥ శార్దూలం బెదలోఁ జరించె, మదిలో స్వార్థంబు రేకెత్తె, సౌ
హార్దం బాత్మవిదూరమై నిలిచె, జ్ఞానాజ్ఞానసంసక్తస
న్మర్ధంబందు వివేక మీఁగిచనె, సమ్యక్ జ్ఞానమార్గం బెటో?
హార్దిక్యంబు వహించి దెల్పఁగదె తోడై నిల్చి జీవేశ్వరా! 23

హృదయములో క్రౌర్యము కదలాడినది. మనస్సులో స్వార్థము విస్ఫారినది. స్నేహ భావము దూరముగ నిల్చినది. జ్ఞానాజ్ఞాన సంఘర్షణలో వివేకము లొంగిపోయినది. ఓ జీవేశ్వరా! నాయెడ వాత్సల్యము వహించి నాకు తోడుగా నిల్చి సరియగు జ్ఞానమార్గ మెటువైపున కలదో చూపుము.

శార్దూల వృత్తములు కదలివచ్చుచున్నవి. అంతయు నే ననెడి భావము కల్గినది. స్నేహాది సంకుచిత భావము లపరిధానములైనవి. నా యెడ వాత్సల్యము వహించి, నాకు తోడై నిల్చి, సరియగు జ్ఞాన మార్గమే వైపున గలదో చూపుము.

ఉ॥ నిత్యము మామకేంద్రియ వినిర్గతమై స్ఫురియించు నీదు సాం
గత్య మెఱుంగలేక, నిను గన్గొను టెట్లని యిన్ని నాళ్లు నే
నత్యభిమాన మానసుఁడనై పలు పోకడలం జరించియున్,
సత్యము గాంచ; నిప్పుడది "సాక్షి"గ నా యెదఁ నుంటఁజూచితిన్! 24

నిరంతరము నా యింద్రియములనుండి వెలుపలికి వచ్చి కన్పించు నీ సాంగత్యమును (చేరికను) తెలిసికొనలేక, నిన్ను చూచుటెట్లో యని యింతకాలము గర్వముతో నే ననేక మార్గములందు చరించుటచే సత్యమును చూడలేనైతిని. ఇప్పుడది "సాక్షి" రూపమున నాహృదయమందే యుండుట తెలిసికొంటిని.

ఇంద్రియ మనగా గ్రహించుశక్తి. దాని బాహ్య రూపములు చర్మము కన్ను చెవి నాలుక నాసికలు. గ్రహణశక్తి నశించినపుడా యవయవము లున్నను నిష్ప్రయోజనములే. ఇంద్రియముల ప్రయోజనము, భగవానుని విభూతుల గ్రహించి లేక వెలువరించి చూపుటయే. ఇంద్రియ సంబంధములగు అవయవముల ద్వారా స్పర్శము రూపము శ్రవణము రసము గంధము అనునవి వ్యక్త మగుచున్నవి.

లోకవ్యవహారమున, చూచినవానిని లేక తెలిసికొనినవానిని "సాక్షి" అందుము. అట్లే జాగ్రత్ స్వప్నావస్థలలో పదార్థముల చూచియు, సుషుప్త్యవస్థయందు వాని అభావమును (లేకుండుటను) గ్రహించియు, తెలుపున దొకటి కలదు. అది స్వయం ప్రకాశము నిత్యము నైనది. అదే జ్ఞానము. జ్ఞానమే సాక్షి. అదే ఆత్మ.

శా॥ ఘోరాఘ ప్రకరంబు చుట్టుకొన, సంక్షోభంబు దైన్యం బెదన్
వైరాగ్యంబును గూర్ప, చంక్రమణ సంపాతంబుల న్మాని, ని
న్జైరెం గీశ సమాన మానసము దా నిశ్శ్రేయసాకాంక్షమై;
శ్రీరామా! కరుణించి త్వచ్చరణ రాజీవంబు లందింపుమా॥ 25

శ్రీరామా! భయంకరమైన పాప సమూహము చుట్టుకొనగా, అశాంతి దైన్యము నా హృదయమున విరక్తిని కల్పింపగా, స్థిరముగ నిలువక గంతులు వేయుటను మాని కోతి వంటి నా మనస్సు మోక్షమును కోరి నిన్ను చేరినది. నీవు కరుణించి నీ పాదపద్మముల నందించి దాని నుద్ధరింపుము.

శా॥ సంసారంబని యూబిలో దిగితి, నిస్సారంపు పంకంబునన్
ధ్వంసీభూత నిజాశయుండనయి సంతాపంబున న్మగ్గఁ ద
చ్ఛంసం దెల్ప నశక్తమయ్యె స్వరమున్ స్వాంతంబు; శ్రీరామ! త్వ
త్సంసక్తి న్నను నుద్ధరింప మిఁక హస్తం బూఁత గావించుచున్॥ 26

శ్రీరామా! మంచిసారము (జలము) గలదని ఊబియందు దిగితిని. కాని నిస్సారమైన బురద నా యాశయమును నశింపఁజేయ మిక్కుటమగు తాపమున మున్గితిని. ఆ మాటను తెల్పుటకు కూడ నా కంఠస్వరము, బుద్ధియు శక్తిహీనము లయినవి. నీ చేరిక వలన, నీ చేతిని ఊఁతగా నిచ్చి నన్ను పైకి తీయుము.

సంసారము సుఖమయమని భావించితినే కాని, అది ఊబియని తలపనైతిని. నా ఆశయమగు సుఖము దొరక లేదు సరికదా, అందు నేను ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికములగు బాధలతో (తాపత్రయము) తలమునక లగుచున్నందున, నిన్ను నుతించుటకు కూడ నా కంఠస్వరము

పెకలుట లేదు. కనీస మిప్పడైనను నిన్ను స్మరింతమని బుద్ధికి స్ఫురించుట లేదు. ఇక నీవే చేయూత నిచ్చి నన్నుద్ధరింపవలె.

మనస్సునకు శరీరమునకు బాధను కల్గించునట్టి అధి, వ్యాధులను ఆధ్యాత్మిక తాపము లనియు, తేళ్లు పాములు క్రూరజంతువులు మున్నగు వానివలన కలుగు ఉపద్రవములు అధిభౌతిక తాపములనియు, కరువులు, కాటకములు ప్రయోగములు భూత ప్రేత పిశాచాదుల వలన కలుగు బాధలు అధిదైవికములనియు చెప్పుదురు.

శా॥ ఏరీతిన్ హృదయంబు విప్పుదును ? నే నేయర్హతతం జూపుదున్ ?
నీరాగంబును రాగ రంజితముగా నెక్కొల్పు శిల్పంబునం
బారీణుంతవు, శూన్య మట్లడంగి శబ్దార్థప్రపంచంబు వి
స్ఫారంజేసిన నీకు నా పలుకు దెల్పం జాలునే నా వ్యధన్ ? 27

ఓ ప్రభూ! నే నేయర్హతను జూపి నీకు నా హృదయమును విప్పి చెప్పగలను ? నీవు రాగాదుల కతీతమై అనంతమైన స్వరూపమునకే (బ్రహ్మపదార్థమునకే), సంకోచము (contraction) కల్పించి మమకారాది వికారములతో సృష్టికల్పన చేయుటందు నేర్పరివి. శూన్యము (Cosmic Void) వలె అణగియున్న చోటనే శబ్దసృష్టితోడను, అర్థ (విషయ లేక వస్తు) సృష్టితోడను నింపి, ప్రపంచమును వికసింప జేసినవాడవు. ఇట్టి నీకు నా బాధను నా పలుకులు తెలుపగలవా ?

రాగ మనునది, పరమేశ్వరుడు తన నిత్యమైన పరిపూర్ణమైన సంతృప్త శక్తిని కుంచించుకొని భోగమునందు నిరంతర మానందించు నట్లు చేయు ఒక ఆవరణము లేక కంచుకము. దీనివలన పురుషునికి (జీవికి) భోగానుభవ సక్తత కల్గును.

"నిత్య పరిపూర్ణ తృప్తిః శక్తిస్తస్యైవ పరిమితానుసతీ
భోగేషు రంజయంతి సతతమముంరాగతత్త్వతాంయాతా।-తత్త్వసందోహం

కాల నియతి రాగ విద్యా కళ లనునవి కంచుకములు. మాయతో

చేత ఇవి భేదభావమును సంకుచితత్వమును కల్పించి, ప్రపంచసృష్టికి కారణ మగుచున్నవి. ఇవి లేనిచో నీ – నా భేదముకాని, రాగాదులుకాని, కాలమునకు కట్టుబడి యుండుటకాని యుండదు. అంతయు నిత్యశుద్ధము, నిర్వికారము, కాలాతిక్రాంతమగు పరబ్రహ్మమే.

పరబ్రహ్మము శూన్యము కాదు. శూన్యమునుండి ఏ పదార్థము జనింపదుకదా! మఱి బ్రహ్మమునుండి శబ్దార్థసృష్టి అంతయు కలిగినది. ప్రపంచమనినపుడు నామ రూపములనియే భావము. బ్రహ్మమునుండి ప్రపంచము కలిగిన దనగా నామ రూప రహితమైన బ్రహ్మము, నామ రూప సహితమై వ్యక్తమైనదని భావము.

ఉ॥ లేని ప్రపంచమం దెఱుక లేని మనంబున కాత్మరూపమే
లేనిదిగా స్ఫురింప, నొక లేమిడి నుండి మఱొక్క లేమికిన్
నే నను నౌకఁ గాలమను నీరధిలోఁ బయనింప, గమ్యము
న్గానక సాగిపోవునెడఁ గాంచవొ నా ప్రభవంబు నీశ్వరా! 28

ఓ ప్రభూ! కేవలము మిథ్యారూపమైన ప్రపంచమున, పూర్ణజ్ఞానము లేని మనస్సుకు, ఆత్మరూపము తెలియని స్థితితో, ఒక లేమినుండి మఱొక్క లేమికి అనగా ఒక జన్మమునుండి మఱొక్క జన్మకు, అహంకారమను నౌకలో, కాలమనెడి సముద్రమున, ప్రయాణముచేయుచు, చేరవలసిన దానిని చేరలేక సాగిపోవునపుడు, నాపుట్టుక కల్గుట చూడలేదా?

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" –శ్రుతి. బ్రహ్మమే సత్యమయినది. జగత్తు లేనిది. పుట్టుచున్నది మఱల పోవుచున్నది కావున జగత్తు. ఇది త్రాటియందు సర్పమువలె, బ్రహ్మమం దారోపింప బడినదే. మనస్సు వచస్సువలె కొంతవఱకే పో గల్గుచున్నది. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" తైత్తిరీయము. అందుచే మనస్సు ఆత్మరూప మును తెలుపజాలదు. ఆత్మ అనునది అన్నమయ (శరీరము), ప్రాణ మయ (ప్రాణము), మనోమయ (మనస్సు), విజ్ఞానమయ (బుద్ధి), ఆనందమయ (అవిద్య), కోశములకంటె అతీతమయినది. మనస్సు, బుద్ధి యందు, బుద్ధి అవిద్యయందు లయించు (కలిసిపోవు) చున్నందున, ఆత్మ

(బ్రహ్మము) మనస్సున కందదు. ఇట్టి స్థితిలో ఒక మిథ్య (జన్మము) నుండి మఱొక్క మిథ్యకు, అఖండకాలమున పయనించుచు తెలియబడని గమ్యం చేరుటకై సాగిపోవు "అహం"నుండి నేనుజన్మించుటనుచూడలేదా?

ఉ॥ తోడుగ నుంటి వీ వనుచుఁ దోఁపమి, నే నవిమృశ్యకారినై,
యీడెవ రింక నాకనుచు, నెంతొ శ్రమించి యొనర్పఁ గర్మముల్
గూడి బలీయమైన తమ గుప్పిట నన్ను బిగించి పట్టె; నే
నేడిచి యేడ్చి, వెల్పలికి నేగతి రా వెరవేది శ్రుంగితిన్॥ 29

నీవు కూడ నావెంట నున్నావని గుర్తింపలేని నేను, యుక్తాయుక్తముల విమర్శింపక, నాతో సమాన మెవరని గర్వించి, శ్రమకోర్చి, కర్మముల చేయగా, అవియన్నియు ఒకటై, తమ బలమైన గుప్పిట నన్ను బిగించి పట్టుకొన్నవి. ఇట్లు బంధితుడనైన నేను, నా అవివేకమునకు దుఃఖించి దుఃఖించి, ఎన్ని ప్రయత్నములు చేసినను వెలుపలికి వచ్చు ఉపాయము కన్పింపక క్రుంగిపోతిని.

చేసిన కర్మములే బంధము లగునని, వాని యినుప పిడికిలినుండి అనుభవింపక బయటపడుట అసాధ్యమని భావము.

ఉ॥ గానుఁగ యెద్దు వోలె తిరుగం దిరుగన్ వ్యథ దక్కెకాని, నా
పూనిక సత్వమున్ జవము వోయెను నిష్ఫలమౌచు, నెందుఁగా
లూనితి నందె నా పరిధి నుంటి నశక్తుఁడ నౌచు, నేఁడు నా
ప్రాణచయంబు తెప్పిలిల బంధము విప్పగదయ్య మ్రొక్కెదన్॥ 30

గానుగ యెద్దువలె సంసారమున కట్టబడి తిరుగగా తిరుగగా, నొప్పి మాత్రము దక్కినది. కాని నా పట్టుదల బలము వేగము వ్యర్థము లయినవి. కాలు పెట్టిన చోటనే ఆ పరిధిని దాఁట లేక అశక్తుడనై యున్నాను. ఇట్టి స్థితిలో నేడు నా ప్రాణములు తేఱుకొనునట్లు బంధమును (సంసారమనెడి గానుగను) విప్పుము. నీకు నమస్కరింతును.

బంధములు (పాశములు) ఎనిమిది విధములు. అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశము లనెడి పంచక్లేశములును మాయ, కర్మ, త్రిగుణ

ములు - వెరశి ఎనిమిది. ఈ పాశములచే బంధితమైన పశువు జీవుడే. జ్ఞానము నిచ్చి పశువునకు పాశవిముక్తి గూర్చువాడు పశుపతి ఒక్కడే.

"పాశ బద్ధ స్తదా జీవః పాశముక్తః సదాశివః
పాశబద్ధః పశుః ప్రోక్తః పాశముక్తః పశుపతిః"

ఇక "అనాది సాంతా బంధావస్థా" - అనుటచే బంధావస్థకు ఆదిలేదు. అంతము కలదు. ఈ బంధములో ఎప్పుడు చిక్కుకొనినది ఎవరికి తెలియదు. కాని గురు కటాక్షమున, దాని అంతమును చూడవచ్చును. నీవే అంతర్యామివై శక్తిరూపమున సర్వకారణభూతమైన శ్రీగురువువు. కనుక నా బంధమును విప్ప సమర్థుడవని భావము.

ఉ॥ వ్యాధులుగాఁ బురాకృతములై పెనుపొందిన పాప సంతతుల్
బాధలఁ గూర్ప నొక్కయెడఁ, బత్నుల నాత్మజులన్ గృహాది వ
స్త్వాదుల భోగము న్దవిలి, యాత్మ విచారము సేయ మానితిన్;
బోధ, ఋణాను బంధములఁ బోల్చుకొనన్ సరిపోవ కుండుటన్! 31

ఒకవైపు పూర్వజన్మమున చేసిన పాపములు వృద్ధిపొంది, శారీరక మైన రుగ్మతలుగా నన్ను బాధించుచుండ, సతీసుతులు, గృహారామాది వస్తువులు కల్గించు భోగములలో దగులుకొని, ఆత్మను గూర్చి ఆలోచించుట మానితిని. నా జ్ఞానము, అవి కేవలము ఋణాను బంధములనియు, నన్ను బంధించు బంధములు మాత్రమే అనియు, పోల్చుకొన దగినంత బల వత్తరము కాకుండుటయే అందుకు కారణము.

"పూర్వ జన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే."
"ఋణానుబంధ రూపేణ పశు పత్ని సుతాలయాః" - ఆర్యోక్తులు.

ఉ॥ వ్యర్థము చేసికొంటి విషయార్థములం దొక జన్మకాల, మి
ట్లర్థము లేని నా బ్రతుకునం దిపుడొక్క మరీచి జాలిమై
సార్థముగా స్ఫురించి, పరమార్థము నీ వని చూప, నేఁడు ని
న్నర్థి నుతింతు, నీల జలదాంతర విద్యు దలేఖ్య భాస్వరా! 32

నీల మేఘము మధ్య వర్ణింప సాధ్యముకాని మెఱుపు తీగవలె

ప్రకాశించు వాడా! విషయ సుఖములలో చిక్కుకొని నేనొక జన్మకాలమునే ఇట్లు నిరుపయోగము చేసికొంటిని. నిష్ప్రయోజనమైన నా బ్రతుకునం దిపుడు, ఒక కాంతి కిరణము అర్థవంతముగా తోచి, నీవే పరమార్థమని చూచి, నేడు నిన్ను ప్రార్థించుచున్నాను.

శ్రీదేవీ చరణ సరోజనిర్గతములైన అనంతకోటి కిరణ సమూహములనుండి, అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 360, మరీచులను గ్రహించి, లోకముల ప్రకాశింపచేయుచున్నారు. "లోకస్య ద్వారమర్చిమత్పవిత్రమ్"- అను తైత్తిరీయ బ్రాహ్మణ శ్రుతిపాఠము మరీచులు (కిరణములు) దేవీచరణ సంజాతములని తెలుపుచున్నది. కనుక దేవీపాద దాసుడనైన నాపై మరీచులలో నొకటి దయదలచుట అసంబద్ధముకాదు. రాముడు దేవీస్వరూపుడే.

"నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖే వ భాస్వరా" - శ్రుతి. పరమేశ్వరుడు నీలమేఘమందలి మెఱపు వలె దుర్నిరీక్ష్యుడు. అందుచేతనే వర్ణింప సాధ్యము కానివాడు. ఒక జన్మకాలమునే వ్యర్థము చేసికొంటి ననుటలో ఈవిషయము చక్కగా తెలియుటయే కారణము. ఇట్లెన్ని జన్మల కాలమును పాడుచేసికొంటినో అజ్ఞాతము.

చం॥ నియతి నతిక్రమించి, యవినీతి తమః పటలాభిఘాత దు
ర్వ్యయ నిజ జీవిత ప్రభల భ్రష్టుఁ డై, విలపించు నన్ను, ని
ర్భయు నిగఁ జేసి సేకొనుము ప్రామిన చీఁకటుల న్విదల్చి, నీ
దయను మదీయ జీవన పథంబునఁ గాయును వేయి వెన్నెలల్॥34

నియమముల పాటింపక అవినీతి యనెడి చీకట్లచే కొట్టబడి మాసిపోయిన నా జీవిత కాంతులవలన భ్రష్టుడనై దుఃఖించెడి నన్ను, భయరహితునిచేసి, న న్నావరించిన చీకటులు విరిసిపోవ స్వీకరింపుము. నీ దయవలన నా జీవనమార్గమున వేయి చంద్రుల వెన్నెలలు ప్రకాశించును గాక.

చం॥ త్రికరణ శుద్ధిఁగూర్చి నిను దెల్పుదము నా మది నిర్వికారమై
ప్రకటిత తత్త్వ దర్శన విరాజితమై ఘట సంస్థిత ప్రదీ
ప కలికయై సుధా ప్లవన భాసురమై ప్రమద ప్రపూర్ణమై
వికసితమౌచుఁ దోఁప, నెద విశ్వ విపంచిగఁ బల్కరింపగా॥ 34

త్రికరణ శుద్ధి (మనస్సు వాక్కు కర్మము భేదములేక ఒకటిగా పని చేయుట) చేకూర్చి, ని న్నెఱిగింతుము. అపుడు నా మనస్సు ఎట్టి వికారమునకు (మార్పునకు) లోనుగాక, పరతత్త్వ దర్శన భాగ్యమున, కుండయందుంచిన దీపజ్వాల వలె నిశ్చలమై. అమృతాభిషేకమున ప్రకాశించునదై, ఆనందమయమై, వికసించును. నా హృదయము విశ్వవీణయై పలుకరించును.

ఉ॥ దీప్తుల కాది దీప్తివయి, దేహి మనంబున జ్ఞానరూపమై,
సుప్త జడ ప్రపంచమునఁ జోదకశక్తిగ నంతరాత్మవై,
ప్రాప్త చిదుల్లసత్సుఖ విపాకమునై, విహరించు నిన్ను సం
తృప్తిగఁ జూడ ని మ్మెడఁద దివ్వె వెలుంగగఁ జేసి రాఘవా! 35

ఓరాఘవా! తేజస్సులకు మూలమైన తేజస్సువై, దేహధారుల మనస్సులలో వెల్గొందు జ్ఞానజ్యోతివై, నిద్రించు (అజ్ఞానావృతమైన) ఈ జడమయ లేక మోహాత్మకమైన ("తచ్చ మోహాత్మకం జడమ్" – వేదాంత పంచదశి) ప్రపంచమును మేల్కొల్పి, నడిపించు అంతరాత్మవై (సవితవై), పొందబడిన చిదానంద ఫలమై విహరించు నిన్ను, హృదయమనెడి దివ్వెను వెలిగించి, సంతృప్తిగా చూడనిమ్ము.

దీప్తుల కాదిదీప్తి యను విషయమున శ్రుతి ప్రమాణములు. "అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి। అస్మా త్సర్వస్మా త్పురత స్సువిభాతి" ఈ పురుషుడే స్వయం జ్యోతిగా ప్రకాశించుచున్నాడు. సర్వమునకు ముందుగా భాసించుచున్నాడు. "తమేవ భాంత మను భాతి సర్వం తస్యభాసా సర్వ మిదం విభాతి". ఆత్మయే సర్వమును ప్రకాశింప జేయుచున్నది. ఆత్మ ప్రకాశము చేతనే ఇది అంతయు భాసించుచున్నది.

మ॥ మతముల్ మార్గము లడ్డువచ్చి నిను సంభావింపలేకున్న, నా
మతిలో నిల్పుము దివ్యరాగమయి రామా! నీదు ప్రేమమ్ములో
శ్రుతిగల్పున్ హృదయమ్ము; జీవునిగ నీ రోచిస్సుధాపూరసం
గతి సువ్యక్తము నౌదు, విశ్వమున నేకత్వంబు దీపింపఁగన్॥ 36

రామా! మతములు అనుసరించు మార్గములు అడ్డు నిలువ, నిన్ను చక్కగా భావింపలేక నిస్సహాయుడ నైనపుడు, నా మనస్సులో దివ్య రాగముగా నిల్పుము. ఆ నీ ప్రేమలో నా హృదయము శ్రుతిగల్పును. జీవునిగా నే నపుడు నీ తేజస్సనెడి అమృతవాహినిలో మునిగి విశ్వమున ఏకత్వము ప్రకాశింపగా వ్యక్తమగుదును.

ఆస్తిక నాస్తిక మిథ్యాది వాదములబట్టి మతము లేర్పడినవి. ఇవి అన్నియు శబ్ద ప్రభవములే. తమోరూప ప్రకృతినుండి పుట్టిన ధ్వని (వాక్కు) తేజో రూపమయి, శుద్ధసత్త్వ స్వభావముగల పరమాత్మను చేర జాలదు. చేర యత్నించినచో, దాని అస్తిత్వము నశించును. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ". దేనిని పొందుటకు యత్నించియు, దానిని పొందలేక మనస్సుతో కూడ వాక్శక్తి మరలివచ్చునో-అది పరమాత్మ. కనుక మతములు నిన్ను చక్కగా తెలుపజాలవు. మీదు మిక్కిలి అవి సంకుచితములై, ఒక్కొక్కప్పుడు మనయోగమునకు అడ్డు వచ్చుచుండును. ఇక మార్గము లన్ననో, ప్రధానముగ శైవ శాక్త సంప్రదాయములలో తెలుపబడిన షడధ్వలు. అధ్వమనగా మార్గము. శివ శివాత్మక పరతత్త్వము సృష్టియందు వ్యక్తమయిన పద్ధతులు, లేక సాంప్రదాయిక వివరణములు. ఇవి ఆఱు విధములు. విమర్శాత్మకములైన వర్ణ, పద, మంత్రాధ్వలు మూడు, ప్రకాశరూపములయిన భువన, తత్త్వ, కళాధ్వలు మూడు, మొత్తం ఆఱు. పరతత్త్వము షడధ్వాతీతము. వివరము కిందవకాశము లేదు.

ఉ॥ ఏ నెవరైనదే యెఱుఁగ, నేమని దెల్పుదు నిన్ను గూర్చి? క
న్గానని పుట్టు గ్రుడ్డి రవికాంతి విశేష ముపన్యసించునే?
మానస సారసంబు శతమాన సముద్యత పత్రహాసముల్
గానుక లీయ, జ్ఞానమయ కాంతులఁ జిమ్ముము భానువంశజా॥ 37

అవిద్య కారణముగ నే నెవరైనదే యెఱుగను. ఇక నిన్ను గూర్చి

ఏమని తెలుపగలను? పుట్టు గ్రుడ్డి సూర్యకాంతి విశేషము నెట్లు తెలుప గలడు? సూర్యవంశమున పుట్టినవాడా! నా మనస్సనెడి శతపత్రము తన నూఱురేకుల విప్పుకొని చిఱునవ్వుల కానుకనిచ్చుటకు అనువుగా నాపై జ్ఞానమయ కాంతులను ప్రసరింప జేయుము. నీ జ్ఞానమువలన సంకుచిత దృష్టి తొలగి మదిలో విశాల భావములు కలుగునని ధ్వని.

మ॥ శ్రుతులం దే పరతత్త్వము న్దెలియ సంశోధింతు, రద్దానినే
సుతుఁడంచున్ హితుడంచు ధర్మరతుఁడంచున్ విద్విషుండంచు భూ
పతియున్ భానుజుఁడున్ బ్రజాళి, తుదకా పౌలస్త్యుఁ డెంచుగ, నే
నతిసామాన్యుఁడ నెట్లు పేర్కొనుదు నీ న్నాత్మస్వరూపుం బ్రభూ! 38

ఓ ప్రభూ! వేదములలో ఏ పరతత్త్వమును తెలిసికొనుటకు వెదకుదురో ఆ పరమేశ్వరుని దశరథుడు సుతుడనియు, సుగ్రీవుడు స్నేహితుడనియు, ప్రజలు ధర్మరతుడనియు, తుదకు రావణ బ్రహ్మ యంతటివాడు విరోధి యనియు తలపగా, అతిసామాన్యుడనైన నేను నిన్నెట్లు పేర్కొనగలను ?

పరమ ప్రేమాస్పదమయి సకలజీవులలో సాక్షియైన బ్రహ్మమే ఆత్మ. అది అన్నిటియందుండును కాని కన్పింపదు. విడువతగినదికాని, గ్రహింపతగినదికాని కాదు. సిద్ధమైన దగుటచే మారదు.

"నా త్మా త్యాజ్యో న చాదేయ స్తస్మిన్ వ్యభిచరో త్కథమ్।" వేదాంత పంచదశి. ఆత్మానంద ప్రకరణము. ఆత్మ త్యజించునది కాని త్యజింపబడునది కాదు. తనతో సమానమగు మఱియొక సత్యవస్తువు లేనందున, దేనికంటెను వేఱైనదియు కాదు. ఇట్టి ఆత్మస్వరూపుడవైన, లేక నా స్వరూపమే అయిన నిన్నెట్లు తెలుపగలను ?

శా॥ రామా! నీ యవతార తత్త్వమెఱుగన్ రాకున్న నేమాయె ? నీ
భూమీశత్వము నిర్మమత్వమును సంపూర్ణత్వముం ద్యాగమున్
సామాన్యంబులె? ఏమి చెప్పగల? నీ జ్ఞానాగ్ని దగ్ధంబులై
మామా కర్మఫలంబు లెల్ల నశియింపన్ ముక్తి చేకూరదో! 39

రామా! నీ అవతార తత్త్వము తెలియకున్న తెలియక పోనిమ్ము. కాని, నీ భూపతిత్వము, మమతా రాహిత్యము, పరిపూర్ణత్వము, త్యాగము

సామాన్యము లెట్లగును ? నీ జ్ఞానమనెడి అగ్నివలన మా కర్మఫలము లన్నియు నశింపగా మాకు ముక్తి కల్గుచున్నది కదా! అది చాలదా ?

ఉ॥ చేసిన ఘోరకృత్యములఁ జెప్పి క్షమాపణ గోరఁ బోను, నేఁ
జేసిన వేవొచేసితిని; చేయఁగఁ జేసిన దీవ కాదె ? నే
గాసిలనేల ? యిప్డు నిను గాంచెడి భాగ్యము నిమ్ము చాలు, నే
నీసరి నవ్య నవ్యముగ నెంతయు నీ చరితంబుఁ బల్కెదున్॥ 40

నేను చేసిన క్రూరపు పనుల చెప్పి నిన్ను క్షమాపణ కోరను నే చేసిన వేవొ చేసితిని. వానిని చేయించినది నీవేకదా! కాకున్నను వానిని గూర్చి యిపుడు బాధ పడుటెందులకు? నిన్ను దర్శించు భాగ్యము నిమ్ము. నా కదియే చాలును. నే నిపుడు నీచరిత్రమును క్రొత్త క్రొత్తగా వల్కెదను.

సృష్ట్యారంభమున జీవులు రూపొందినపుడే కర్మల నిశ్చయించి వారిచే వానిని చేయించినది ఈశ్వరుని శక్తియేకదా! తరువాత కర్మ ఫలములబట్టి వారు వివిధ జన్మము లెత్తుటకు పరోక్షముగ ఆయనే కారణము కదా! (ఇది సత్యము కాదని తరువాత పద్యములలో నిరూపింపబడినది.)

చం॥ మును దొలి సృష్టి, నీవ బహు మూర్తులఁ దాలిచి వ్యక్తమైనఁ,ద
ద్ఘన పరిణామమందు నినుఁ గాంచని జీవు లనంత యాత్రలోఁ
గనుచు జగాల ముక్తికయి గాఢముగాఁ దపియింప, వారికై
వెనుకవొ నీవు నా విరహ వేదన కోర్వక, లోక నాయకా! 41

లోకనాయకా! పూర్వము నీవు, అభిన్నమై, అనిర్వాచ్యమహిమ కలదైన నీ ప్రకృతి ద్వారా, సృష్టిని ప్రారంభించు నపుడు నీవే అనేక రూపముల ధరించి, కన్పింపగా, ఆ గొప్ప పరిణామమందు తామే నీవని గుర్తింపని జీవులు అనంతయాత్రలో లోకముల చూచుచు, ముక్తికయి తపించుచుండ, నీవు కూడ వారి విరహమును భరింపలేక, వారికై వెదకుదువు కదా! అనగా అవిద్య కారణముగ నిన్ను గుర్తింపని జీవులు నీలో చేరుటకును, నీవు వారిని చేర్చుకొనుటకును పరితపించు చున్నారని భావము.

స్వస్వరూపము కలవాడు కూటస్థుడు. ("కూటవ న్నిర్వికారేణ

స్థితః కూటస్థ ఉచ్యతే") స్వేతర వస్తు జ్ఞానము కలవాడు జీవుడు. ఈశ్వరత్వము జీవత్వ మనునవి ఉపాధుల వలన కలిగినవే. బ్రహ్మము తన శక్తినే ఉపాధిగ పొంది ఈశ్వరుడుగను, కోశోపాధిని పొంది జీవుడుగ నయ్యెను.

"ఈశ్వరత్వం చ జీవత్వం ఉపాధి ద్వయ కల్పితమ్"–"త చ్ఛక్త్యుపాధి సంయోగాత్ బ్రహ్మైవేశ్వరతాం వ్రజేత్" "కోశోపాధి వివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతామ్" – వేదాంత పంచదశి పంచకోశప్రకరణం. "చైతన్యంయ దధిష్ఠానం లింగదేహశ్చయఃపునః చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే" – వేదాంతపంచదశి ద్వైతవివేకము. చైతన్యము, చైతన్యమందు కల్పింపబడిన లింగ (సూక్ష్మ) దేహము, లింగ దేహమున తోచు చిద్రూపముయొక్క ప్రతిబింబము (చిదాభాసుడు) ఈ మూడిటి సముదాయమే జీవుడగుచున్నాడు.

ఉ॥ జీవుని వోలె నీవును వసింతువు దేహమునంద సాక్షివై,
నీవలెఁ జూచుచు న్మనఁగ నేరని జీవుఁ డొనర్చుఁ గర్మలం
జావును పుట్టువుల్ గలుగ, సంసృతి దాఁటి చరింపలేఁడు, సం
భావనసేతు వృక్షగత పక్షి యుగంబుగ మిమ్ము నిర్వురన్॥ 42

జీవుని విడువ నేరని నీవును అదే ఉపాధి యందున్నను, కేవలము సాక్షి రూపమున వసించుచు, జీవు డొనర్చు కర్మలను చూచుచుందువు. కాని ఆతడు (జీవుడు) మాత్రము ఆ ప్రకృతి రూప వృక్షమును అంటి పట్టుకొని, అందు ఫలించు ఫలములను (చావు పుట్టువులను) అనుభవించుచు సంసారము దాఁటి బయట పడలేడు. నీవును జీవుడును ప్రకృతి రూపమైన ఒకే చెట్టును ఆశ్రయించిన రెండు పిట్టలవలె ఉన్నారనుకొందును. అం దొకటి వృక్షఫలముల రుచిచూచుచుండ, రెండవది వానిని తినక కేవలము వీక్షించు నట్లున్నది మీ వర్తనము.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా। సమానం వృక్షం పరిష్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి॥" –శ్రుతి.

ఈశ్వరుడు సర్వ వ్యాపకుడు. కనుక ప్రతి శరీరమందును జీవునితోపాటు

తానును అంతర్యామిగా ప్రవేశించి, జీవుడు చేయు కర్మములకు సాక్షి యగుచున్నాడు.

ఉ॥ సంచితమున్ భుజింపఁ దగు సాధనమౌ తనువీయఁ దండ్రి, నీ
వంచిత రీతి భద్రముగ నాతని కర్మఫలంబు మూటగా
వించుచు నంటఁగట్టుదువు వీడని బంధము చేసి, జీవుఁడీ
క్షించ డవిద్యఁ గప్పబడిఁ చేరిన క్రొత్త శరీర మెంచుచున్॥ 43

దాచుకొన్నది (సంచితము) అనుభవించుటకు అనువైన శరీరమును తండ్రి చేకూర్పగా, నీవు భద్రముగ ఆతడు కూడపెట్టుకొనినది (కర్మఫలమును) మూటగట్టి తెచ్చి దృఢముగా వానికి అంటగట్టుదువు. జీవు డవిద్యచే గప్పబడి యుండుటవలన, క్రొత్తగా తనకు లభించిన శరీరమును తలచి మురిసి పోవునే కాని, దీనిని గమనించుటలేదు.

ఉ॥ కాలము నీ యధీనమునఁ గాఁబుట నీ కెటులైన జెల్లుఁ ద
త్కాలమె మాయెడం బరిమితంబయి జన్మ పరంపర వ్యథా
జాలములన్ బిగింపఁ గనఁజాలవొ ? మోక్షము నీయఁజాలవో ?!
ఏల భవ ద్వియోగమున నింకను మమ్ము దపింపఁ జేయుటల్ ? 44

కాలము నీ అధీనమున నుండుటచే నీ వెటువేసినను నీకు చెల్లును. కాని ఆ కాలమే మా విషయమున పరిమితమగుటవలన మేము నిన్ను తెలిసికొనిని నీలో చేరులోపల జన్మపరంపరలనెడి బాధల వలలో చిక్కుకొనగా, మమ్మేల చూడవు ? మోక్షము నీయలేవా? నీ విరహములో మమ్మింకను తపింపజేయు టెందులకు !

పరమేశ్వరుని నిత్యతను జనన మరణ రూపమున పరిమితముచేయు ఆవరణములలో కాల మొకటి. "సా నిత్యతాస్యశక్తి నికృష్య నిధనోదయ ప్రదానేన నిత్యత పరిచ్ఛేదకరీ క్లప్తా స్యాత్ కాలతత్త్వ రూపేణ."– తత్త్వ సందోహం ఈ కాలావరణము అఖండకాలము యొక్క కల (భాగము) మాత్రమే. ఇది స్థూల తత్త్వ దృష్టితో ప్రారంభమైన "సకల కాలము." కాలము కాలమందు నన్ను నడిపించుచున్నది–Time leads me in time అనుటయందలి అంతరార్థ మిదియే.

మ॥ యుగముల్ వోయె, గతించెఁ గల్పములు, నీ యునికింగనంజాలమో
జగదీశా! మము నేల ద్రిప్పె దిటు లీ సంసారచక్రంబునన్ ?
సుగతిం జూపఁగరాదె నేఁటి కయినన్ శోధించుటల్ మాని, ఆ
నిగమాంత ప్రతిపాదితాత్మగుణ సందీప్త ప్రపంచోదయా! 45

ఓజగదీశ్వరా! యుగములు పోయినవి. కల్పములు గతించినవి. కాని నీ యునికిని తెలియలేకున్నాము. మమ్ము ఈ సంసార చక్రములో ఇట్లెందుకు త్రిప్పుచున్నావు? ఉపనిషత్తులలో తెలుపబడిన స్వీయ గుణములచే ప్రకాశించిన ప్రపంచోదయము కలవాడా! నేఁటి కయినను మమ్ము పరీక్షించుట మాని మాకు సుగతిని చూపరాదా ?

చం॥ అగణిత జీవ జాలమున కవ్యయమౌ నిధి వౌట, నీవ మా
సుగతికి మూలమం చెఱిఁగి చూతుము నీకయి యాశతోఁ, నీ
వగపడకుండఁ గన్మొఱఁగి యామిని దాగు నహస్సు వోలె నే
ర్పుగఁ జరియింతు మా హృదయ పుష్కర దివ్య మరంధ ధారవై। 46

లెక్కింప శక్యము కాని ప్రాణి కోటికి తరుగని నిధి వగుటచే, నీవే మా సుఖమునకు, మోక్షమునకు, ఆధారమని తెలిసికొని నీకొఱకు ఆశతో ఎదురుచూచుచున్నాము. కాని నీవు మాత్రము మా కగుపించకుండ మాయచేసి, రాత్రియందే దాగు పగలు వలె, మా హృదయ పద్మములలో తేనె సోనవయి, నేర్పుగ చరించుచున్నావు.

శా॥ నీకున్ మావలె మాంద్యమున్ గలుగునే? నిశ్శ్రాంతి నజ్ఞానపుం
జీఁకట్లం దొలఁగించి మేల్కొలుపు మ జ్జీవప్రపంచంబు, నో
లోకేశా! భవదీయ యోగమున నాలోకింతు సాయుజ్యమున్,
సాకారంబగు సృష్టి సర్వ మొకటై సత్యంబు దీపించఁగన్॥ 47

లోకేశ్వరా! నీకు కూడ మాకు వలె మాంద్య ముండునా? అలసట లేక అజ్ఞానపు చీకట్లను తొలగించి నా జీవ ప్రపంచమును మేల్కొల్పుము. అట్లు మేల్కొన్న నా ప్రపంచము నీతో కలియుటవలన, అనగా జ్ఞానమును పొందుటవలన – ఆకారముతో కూడిన ఈ సృష్టి అంతట నిండియున్న ఏకైక సత్యమందు సాయుజ్యమును పొందుదు.

సాయుజ్య మనునది ముక్తి. ముక్తు లైదు విధములు. సార్ష్టి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు.

1. సార్ష్టిముక్తి-సృష్టికి సంబంధించినది. మణిపూరక చక్రార్చనము చేయువారి కిది లభ్యమగును. పరమేశ్వరుని నివాసమగు పరంధామము చివర నివసించుట దీని లక్షణము.

2. సాలోక్యముక్తి-అనాహత చక్రోపాసకులకు కలుగునది. ఎల్లపుడు పరమేశ్వరుని చూచుచు ఆనందించుట దీనికి గుర్తు.

3. సామీప్య ముక్తి - విశుద్ధ చక్రోపాసకులకు లభించునది. పరమేశ్వరునికి సమీపమున నుండు స్థితి.

4. సారూప్య ముక్తి - ఆజ్ఞా చక్రోపాసకులకు దొఱకునది. పరమేశ్వరునితో సమానమైన రూపమును పొంది యుండుట.

5. సాయుజ్య ముక్తి - సహస్రార కమలోపాసకులకు ప్రాప్తించునది. పరమేశ్వరునిలో కలిసిపోవు స్థితి.

ద్వైతులు సామీప్య ముక్తిని, విశిష్టాద్వైతులు సారూప్యముక్తిని, అద్వైతులు సాయుజ్య ముక్తిని చెప్పుదురు.

## సుధాస్నానము

ఉ॥ రాక్షస భావ జృంభణ పరాఙ్ముఖమైన మనంబు, నీదు సం
రక్షణ కోరి నిల్చినది రామ! దశాశ్వదురాగతంబులన్
శిక్షణసేయ ని న్నినుతిఁ జేసెడి దైవత బృందమట్లు; నీ
వీక్షణతోడ నాత్మ పదవీస్థితిఁ గూర్చి తరింపఁజేయవే॥ 48

రామా! రావణుని దుచ్చేష్టలకు విసిగి వానిని శిక్షింపుమని నిన్ను ప్రార్థించిన దేవతల సమూహము వలె దుష్టభావ జృంభణమునకు పెడ

మొగము పెట్టిన నా మనస్సు, నీ సంరక్షణము కోరి నిల్చినది. నీ కటాక్షము తోడనే ఆత్మపదవియందు నిల్చి, దానిని తరింపజేయుము.

పరమేశ్వరుని అనుగ్రహము లేక ఆత్మజ్ఞాన మలవడదు కనుక, తొలిమెట్టుగా చంచలమైన మనస్సునకు రక్షణ గూర్చుమని కోరబడినది. కష్ట సమయములలో భగవత్ప్రార్థనము కంటె ఊరట గూర్చునది, రక్షణ మిచ్చునది మఱియొకటి లేదు కదా!

మ॥ వర గర్వోద్ధతుఁడైన రావణునిఁ గూల్పన్ దుష్ట దైతేయులం
బరిమార్పన్ జనియింతు నే ననుచు, నాశ్వాసించి బ్రహ్మాది ని
ర్జరులం, బంక్తిరథాత్మజుండవయి, కౌసల్యా మహానంద వి
స్తర దుత్ప్రభవుండవౌట కపుడే సంకల్పమున్ బూనవో॥ 49

బ్రహ్మ వరమువలన గర్వించిన రావణుని చంపుటకును దుష్టులగు రాక్షసుల గూల్చుటకును నే నవతార మెత్తెదనని బ్రహ్మాది దేవతల నోదార్చి, దశరథ పుత్రుడవై, కౌసల్యకు మహానందమును గూర్చుచు, అవతరించుట కపుడే సంకల్పింపలేదా ? అట్లే నా విషయమును కూడ ఆలోచింపుమని ధ్వని.

చం॥ సుతులను గోరి చేసె నజసూనుఁడు యజ్ఞము దీక్షతోడ, స
ద్గతి కిరవైన జ్ఞానమును గాంచ నొనర్చితి ధ్యాన యజ్ఞమున్
వితరణతోడఁ బంక్తిరథు వేడుకఁ దీర్చిన భంగి, నేఁడు నా
మతి ముదమందఁ జేయఁదగు మాధవ! భక్తజనైక బాంధవా! 50

ఓలక్ష్మీనాయకా! అజమహారాజు కుమారుడగు దశరథుడు, సంతానము కొఱకు దీక్షతో పుత్రకామేష్టిని చేసినట్లు సద్గతికి నెలవైన జ్ఞానమును కోరి నేనును ధ్యానయజ్ఞమును చేసితిని. వరదాతవై దశరథుని వేడుక తీర్చినట్లు భక్తజనబాంధవుడవగు నీవు నేడు నా కోరికను తీర్చి నా మనస్సును కూడ సంతసింప చేయుము.

జ్ఞానమనగా తెలివి. మోక్ష సాధన బుద్ధిని జ్ఞానముగను, మోక్షమును గాక ఇతరమును తెలుపు దానిని విజ్ఞానముగను చెప్పుదురు.

శా॥ ఏకుం బుట్టుకతోఁ బనేమి ? జగముల్ నిర్మించి నిర్ఛిద్రమై
సాకం గూర్పఁగఁ జేయువానికిఁ, బురస్కారంబు సేకూర్పగా
మాకై మానవుఁడై తి గాని; నను సంభావింప నస్మన్మన
స్సాకేతంబున జన్మమందు మభవా! జ్ఞాన ప్రరోహంబవై ॥ 51

పుట్టుకలేని వాడా! లోకముల సృష్టించి, జాగరూకుడవై రక్షించి, సంహరించు నీకు, పుట్టుకతో పనేమున్నది ? కాని మాకు గౌరవము నాపాదించుటకై మానవునిగా జన్మించితివి. అట్లే నన్ను గారవించుటకు నా మనస్సనెడి సాకేత నగరమున జ్ఞానపు మొలకవై జన్మింపుము.

స్వస్వరూపమును గూర్చిన ఎఱుకయే జ్ఞానము. “సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే” “నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే” భగవద్గీత 4-33,38. స్వరూపమునుగూర్చిన ఎఱుకకల్గుటతో అన్ని కర్మలు సమాప్తమగును. మఱియు జ్ఞానముతో సమానమయిన పవిత్ర వస్తువు మఱియొకటి లేదు దీనిని సంపాదించుకొనుటకు అనేక జన్మము లెత్త వలసి యుండును. కనుకనే జ్ఞానము నిమ్మని ప్రార్థన.

శా॥ స్వామీ! రాఘవ! లోక భీకర తమిస్రారాతి రోచి ర్ఘృణి
స్తోమాదిత్య నవాన్వయుండ వగుటన్ శోభించె నీ ధాత్రి తా
భూమానందముతోడ, నీదు ప్రభవంబుం జూచి; విప్పారు నీ
నామంబున్ విని వేయి రేకులను హృన్నాళీకముల్ వింతగా॥ 52

స్వామీ! రాఘవా! లోకమునకు భీతిని గొలుపు చీకటికి విరోధియగు సూర్యుని వంశమున క్రొత్తగా జన్మించుటచే, నీ ప్రభవమును జూచి, ధరణి మహానందమున శోభించినది. అది సహజమే. కాని నీ పేరు విని నంతనే హృదయ కమలములు తమ వేయి రేకులను విప్పుకొనుటే వింత, అసామాన్యము.

మ॥సరయూ తీర వనాంతరమ్ములఁ గృపాసారమ్ము వర్షించుచుం
జరియింప న్నవ నీల మేఘముగ, నీ శంపాలతల్ సోదరుల్
దరుఅం జేరి వసించి రీ వపు డయోధ్యన్ బాలుఁడై యాడుచోఁ;
బురి విప్పెన్ హృదయమ్ము బర్హి యగుచుం బూర్ణాను మోదంబునన్॥53

నీవు అయోధ్యలో బాలుడవై ఆడునప్పుడు సరయూ నదీ తీరముల దయావర్షమును కురిపించు క్రొత్త నీల మేఘము వలె చరింపగా, నీ కిరు వైపుల మెఱుపులవలె నీ సోదరులు ప్రకాశించిరి. నా హృదయ మా మేఘమును జూచి (భావించి) నెమలియై ఆనందముతో పురి విప్పినది.

ఉ॥ ఆసుర భావముల్ మనసు నంటి పవిత్రతఁ బాడొనర్పఁగా
వేసరి నీ సహాయమును వేడఁగ వచ్చితి రామచంద్ర! నీ
వీసరి తోడు నిల్చి మది నేర్చు నశాంతినిఁ బాప రమ్ము, నీ
భాసుర నామ సాయకము పాఱఁగఁ ద్రోలెడుఁ బాప చింతనన్॥ 54

తామస భావములు మనస్సును తాకి, దాని పవిత్రతను పాడుచేయగా, విసిగి వేసారి నీ సహాయమును కోరవచ్చితిని. నీ విపుడు నాకు తోడుగా నిల్చి, మనస్సును బాధించు అశాంతిని పోగొట్టుటకు రమ్ము. నీ పేరనెడి తేజోవంతమయిన బాణము పాపచింతనను పాఱద్రోల గలదు.

విశ్వామిత్ర మహర్షి రాక్షస సంహారార్థము రాముని తీసికొని పోవుటకై దశరథుని చూడ వచ్చిన ఘట్టము స్మరింపబడినది.

శా॥ స్వామీ! నిత్యము మానసాశ్రమములన్ స్వాస్థ్యంబుఁ బోకార్చు దు
ష్కామంబున్ బరిమార్చి తాటక వధోత్కర్షంబుఁ జూపించి, హృ
ద్భూమిం దామస భావ జృంభణము నున్మూలించి రక్షింపవే;
నీమం బొప్పఁ ద్వదీయ నామ జప సందీప్తుండనై నిల్చెదన్। 55

స్వామీ! ఎల్లప్పుడు మనస్సులనెడి ఆశ్రమముల ప్రశాంతతను, పోగొట్టు చెడ్డ కోరికను తాటకను చంపినట్లు సంహరించి, హృదయ భూమిపై తామసభావ ఔన్నత్యమును నశింపజేసి రక్షింపుము. నియమముతో నీ నామమును జపించి ప్రకాశింతును.

ఉ॥ కౌశిక యాగ రక్షణముగాఁ దలపోయుము, చాలు; నింకఁ దాఁ
బైశున మీసడించి మది పాయదు ధర్మ నిరూఢ వృత్తి; య
క్షైశుఁడ వీవు పూనికొని యెంతయు రక్షణ గూర్పకున్న, నా
యాశయ సిద్ధి గల్గ జననాదికముల్ నశియించు నేగతిన్? 56

నీ విపుడు విశ్వామిత్రుని యాగమును రక్షించినట్లు భావింపుము, చాలును. ఇక నా మనస్సు నిశ్చితమగు ధర్మమును వీడి క్రూరప్రవృత్తి వహింపదు. యజ్ఞేశుడవు కనుక నీవు పూనికొని రక్షణ చేకూర్పనిచో, నా యాశయమగు మోక్ష మెట్లు సిద్ధించును? చావు పుట్టువులెట్లు తొలగిపోవును? నీ రక్షణముననే విశ్వామిత్రుని ఆశయమైన యజ్ఞనిర్వహణము, రాక్షసుల తొలగింపు కలిగినవి కదా!

శా॥ ప్రారబ్ధంబున ధర్మ దూరమయి, శప్తంబైన చిత్తం బహో!
మారెన్ గండశిలోపమంబగుచు రామా! నేఁడు త్వన్నామ ము
ద్రా రమ్యంబయి, నవ్య చేతన సముద్యద్దివ్య చారిత్రమై,
చేరన్ వచ్చెడుఁ దా నహల్య వలె నీ శ్రీభావ సంస్పర్శతో॥ 57

ప్రారబ్ధ వశమున ధర్మమునుండి దూరమై శపింపబడిన మనస్సు, గండశిలవలె మారినది. ఓ రామా! నేడు నీ నామ ముద్రచే సుందరమై, నూతన చైతన్యముతో ఉద్ధరింపబడిన చరిత్రగలదై, నీ మంగళకరమైన భావస్పర్శతో అది అహల్య వలె చేరగలదు.

ప్రాతఃస్మరణీయులైన పంచకన్యలలో ప్రథమయగు అహల్య, గౌత మునిచే శపింపబడి శిలగా మారుటకు ఆమె ప్రారబ్ధమే కారణము కాని అన్యము కాదు.

ఉ॥ గౌతమ పూజిత మ్మఖిల కల్మష తాప శమమ్ము నాత్మ ర
క్షా తరళమ్ము భక్త జన కాంక్షిత దాయకమైన నీదు వి
ఖ్యాత పద ద్వయిం గడిగి, కంజభవుండు గుహుండు ధన్యులై;
రీతరి వాక్ప్రసంగతిని నేను ధావన సేయఁ గోరెదన్॥ 58

గౌతమమునిచే పూజింపబడినదియు, అన్ని పాపములవలన కలిగిన తాపముల పోగొట్టునదియు, ఆత్మను రక్షించుటందు అనురాగము కలిగి ప్రకాశించునదియు, భక్తుల కోరికలను తీర్చునదియు అగు, నీ ప్రసిద్ధి చెందిన పాదముల జంటను, తొల్లి బ్రహ్మయు, గుహుడును కడిగి ధన్యులైరికదా! నేను కూడ నా వాగ్ధారతో వాని నిపుడు కడుగ దలచెదను.

శా॥ సీతా మానస రంజకమ్మయిన నీ శ్రీమూర్తి వీక్షించి, సం
ప్రీతిం జెందె విదేహ, స్వాత్మ పదవీ విన్యస్థ నిర్మోహయా
రీతిం దొల్లి; త్వదీయ దర్శన కృతార్థీభూతుం గావించి, ఓ
భూతాత్మా! ఇంక నీ కటాక్షములె న న్బ్రోవన్ సమర్థంబులో॥ 59

సీత మనస్సును రంజించు నీ శుభప్రదమైన రూపమును చూచి, పూర్వము విదేహ నగరమే భ్రాంతిని తొలగించుకొని, ఆత్మపదవియం దుంచబడినట్లు ఆనందించెను. సకల జీవులకు ఆత్మయైనవాడా! నీ దర్శనము వలన నన్ను కృతార్థుని గావించి, ఇక నీ కడగంటి చూపులే నన్ను రక్షింప సమర్థములగును.

మ॥ మది సీతాసతియౌచు భక్తి సుమదామంబున్ సమర్పింపగాం
గదియం జేరెడు నిన్ను; మోహ ధనువున్ ఖండించి, నీ విక్రమం
బదె శుల్కంబుగం జేసి చేకొనుము గల్యాణార్థ మద్దాని, నో
హృదయేశా! భవదీయ యోగము జగచ్ఛ్రేయంబు చేకూర్చెడిన్॥ 60

మనస్సు సీతయై భక్తి యనెడి పూల మాలను సమర్పించుకొనుటకు నిన్ను చేరుచున్నది. మోహమను ధనువును విఱిచి, నీ విక్రమమే శుల్కముగా చేసి, శుభమును గూర్చుటకొఱకు దానిని గ్రహింపుము ఓ హృదయాధినాథా! మీ కలయిక లోకములకు శ్రేయస్సును చేకూర్చును.

ఈశ్వరాధీనమైన మనస్సు, లోకమునకు శ్రేయస్సును కూర్చ ననుటలో విప్రతిపత్తి లేదు. నైతికాధారము లేని బుద్ధి, లోకపీడనమున కుపకరించు టెల్లరకు తెలిసినదే కదా!

మ॥ జడమై పాపభరంబునై యెసంగు నజ్ఞానంపుం బెన్విల్లు, నా
కడం బూర్వానుగతంబుగా వెలసి, మద్గర్వాశ్రయంబయ్యె; నే
పడరన్ దానిం గదల్చె దేవి మును గ్రీడాసక్తి; నీ వింక నా
మృడ బాణాసన మట్లు సేకొనుము సంప్రీతిం బ్రభంజింపంగా॥ 61

జడరూపమై (కదలికలేనిదై) పాపములచే బరువైన అజ్ఞానమనెడి గొప్పవిల్లు అనేక జన్మములనుండి నన్ను వెంబడించుచు నా గర్వమున కాశ్రయమై నావద్ద నున్నది. సృష్టిక్రీడాపరాయణయగు పరదేవత దానిని

కదలించినది. నీ విపుడు శివధనుస్సును వలె దానిని గ్రహించి విఱచి వేయుము.

శివుని ధనుస్సు మిక్కిలి బరువైనది, గొప్పది, పురాతనమైనది. అట్టి ధనువు తమకడ నుండుట మిథిలాధిపులకు గర్వకారణము. ఒక పర్యాయము బంతియాట సందర్భమున సీత దానిని కదలించి, దానిక్రింద బడిగియున్న బంతిని తెచ్చినది.

చం॥ పురుషుఁడ వీవు, నీ ప్రకృతి భూమిజ, మీ యవిభాజ్య భావమున్
ధరణి నెఱుంగఁ జేయుటకు దంపతులై తిరి; జీవుఁ డీశ్వరుం
డిరువుర నొక్కటైన పరమేశ్వర తత్త్వము మీ వివాహమై
పరగె ముముక్షువుల్ దెలియ, బ్రహ్మపదస్థితి నిల్వ లోకముల్॥ 62

నీవు పురుషుడవు అనగా ప్రకృతి (మాయా) సంబంధముగల ఈశ్వరుడవు. సీత నీ ప్రకృతి లేక స్వభావమే. "బ్రహ్మణ స్సకాశా న్నానావిధ చిత్రజగ న్నిర్మాణ సామర్థ్యక బుద్ధిరూప బ్రహ్మశక్తి రేవ ప్రకృతిః"- నిరాలంబోపనిషత్తు. పరమేశ్వరునుండి వ్యక్తమైన వివిధము లగు చిత్ర జగత్తుల కల్పించు సామర్థ్యముకల బుద్ధిరూపమైన బ్రహ్మ శక్తియే ప్రకృతి. ఇట్లు విభజింపరాని మీ భావమును జగతికి తెల్పుటకై మీరు దంపతులైతిరి. జీవునియందును ఈశ్వరునియందును ఏకముగ నున్న పరమేశ్వర తత్త్వమే మీ వివాహమని మోక్షకాములు తెలిసికొనగా, లోకములు బ్రహ్మపదస్థితి నిలువగా, ఒప్పుచున్నది. అఖండాకారమై యున్న పరబ్రహ్మమే ఈశ్వరుడై బ్రహ్మాండమందును, జీవుడై పిండాండమందును, సర్వత్రా వ్యాపించి యున్నది.

చం॥ ఇరువురుగాఁ దలంచి మిము నేకముసేయ వివాహ సంస్క్రియా
చరణము నిర్వహించిరి ప్రశస్తముగా రఘురామ! నేఁడు మి
మ్మిరువుర నేకరూపముగ నెంచి, తరింపఁగ నుద్యమించి, నీ
చరణములంద, నా దనెడి స్థానము చూచుకొనంగఁ గోరెదన్॥ 63

ఓ రఘురామా! ఇరువురుగా భావించి నిన్నును సీతను ఏకము సేయుటకై వివాహ సంస్కారమును ఘనముగా నిర్వహించిరి. నేడు

మిమ్మెరువురను ఒకే రూపముగ తలచి తరించు తలపుతో నీ పాదముల కడ "నాది" అను స్థానమును వెదుక గోరెదను.

మ॥ పరమంబౌ నిజతత్త్వ దర్శన మహాభాగ్యావరోధంబుగా
దురహంకార తమచ్ఛటల్ ముసిరెఁ జేతోభూమిఁ; జాపంబుతో
నరిదుర్వారుఁడు జామదగ్ని బల మత్యంతంబు పోకార్చిన
ట్లీరులం గూలిచి దివ్యదర్శనము నా హృత్సీమకుం గూర్పవే॥ 64

శ్రేష్ఠమగు స్వాత్మ దర్శనమను గొప్ప భాగ్యమునకు ఆటంకముగా దురహంకారమనెడి చీకట్లు నా మనసున ముసిరినవి. శత్రువులచే వారింప శక్యుడు కాని పరశురాముని బలమును, ఆతని విల్లందుకొని పరిపూర్ణముగ పోజేసినట్లు, ఆ యహంకారపు చీకట్ల అడ్డును తొలగించి, నా హృదయ సీమకు, నీ దివ్యదర్శనము కల్గింపుము.

శా॥ కల్యాణాత్మకమైన నీ చరిత మాకర్ణించి, యానంద సా
కల్యం బందె మనం బయోధ్య యగుచుం, గాకుత్స్థ వంశంబు సా
ఫల్యంబందఁ బరశ్వధాస్త్ర బలమై ఫల్యంబు గల్పించు నా
జల్యంబున్ భవదీయ మెంచి, భువి నీ సంరక్షణం గోరెదన్॥ 65

గార్హస్థ్యముతో కూడిన, శుభమును కల్గించు, నీచరితమును విని ఆనందముతో నిండి నా మనస్సు అయోధ్య అయినది. కాకుత్స్థవంశము సఫలముకాగా, పరశురాముని బలమును విఫలము చేసిన నీ తేజమును స్మరించి ఈ లోకమున నీ రక్షణ కోరుచున్నాను.

రాముడున్నతావే అయోధ్య. కనుక రాముని గూర్చి ఆలోచించు మనస్సే అయోధ్య. మఱియు "అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా। తస్యాగ్ం హిరణ్మయః కోశః।" - అరుణం. ఎనిమిది చక్రములు నవద్వారములు కలిగి దేవతలుండెడిస్థానము అయోధ్య. - శరీరమని భావము. శరీరమును నడిపించునది మనస్సేకదా!

శా॥ రాకాపూర్ణశశాంక సుందరముసై రాజిల్లు నీ మోముపైఁ
బ్రాకన్మ్రాగెడి నీలి ముంగురులు నా ప్రారబ్ధమట్లడ్డురా,
నాకర్ణాంత విశాల నేత్రములు నా కానందముం గూర్పు, మో
సాకేతాధిప! నిన్నె నా హృదయ రాజ్యాధీశు గావించెదన్॥ 66

పదునాలు కళల చంద్ర బింబము వలె సుందరమై ఒప్పారు నీ ముఖమున నల్లని ముంగురులు నా ప్రారబ్ధము వలె నిను చూడనీయక మూగగా, చెవులదాక వ్యాపించిన నీ విశాలములయిన కన్నులతో, నీవే నా కానందమును గూర్పుము. ఓసాకేతాధీశ్వరా? నిన్నే నా హృదయ రాజ్యమునకు ప్రభువు నొనర్తును!

రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయవలె నని దశరథుడు సంకల్పించుట ధ్వనింపచేయబడినది.

ఉ|| నీ సుగుణంబుఁ, దేజమును, నిస్తుల ధైర్యము, సత్యశీలమున్,
భాసుర ధర్మదీక్ష నతపాలనదక్షత నెంచి, రాజు వి
శ్వాసముతోడ నీకు యువపట్టమె గట్టిన, నీ కదెట్లు దు
ష్టాసుర శిక్ష, సాధు జనతావన దీక్ష వహింప సాధ్యమౌ?! 67

నీ సుగుణమును, పరాక్రమమును, తేజస్సును, సాటిలేని ధైర్యమును, సత్యశీలమును, ధర్మదీక్షను, శరణాగత రక్షణ దక్షతను, గ్రహించి దశరథ మహారాజు నీకు యౌవరాజ్య పట్టము కట్టదలచెను కాని, యువరాజువై యున్న నీ అవతార ప్రయోజనమగు దుష్ట దానవ సంహారము, శిష్ట జన సంరక్షణము, ఎట్లు సాధ్యమగును ?

ఉ|| కావున మంథరా వచన కల్పిత కార్య విఘాత కైక నీ
భావము మున్నెఱింగినటు పంపె నరణ్యములన్ వసింపగా,
నీవును దండ్రి యాజ్ఞఁ దల నిల్పి వనాంతర దుర్గసీమలం
బోవఁ దలంప, నింక నెటు వోదురు చావక నిర్జరాహితుల్? 68

కనుకనే మంథరచే (కైక పుట్టింటినుండి వచ్చిన దాసి) ప్రబోధింపబడి, పట్టభంగమునకు కారణమైన కైక నీ భావమును ముందే తెలిసిన దానివలె నిన్నరణ్యములలో వసింపుమని పల్కెను. నీవు కూడ తండ్రి మాటను తలదాల్చి అరణ్యముల కేగదలచినవి. ఇక రాక్షసులు చావక తప్పించుకో లేరు.

ఉ|| ఔ ననలేక, కా దనక, యాత్మహితంబు గ్రహింపలేని భూ
జానియు, సత్య భంగమని జాయకు మార్పలుకంగ మానినన్,
మానదు కైక పట్టుదల, మాయురె! యింద్రియ యూటముద్ధతిన్
జ్ఞానము గట్టినట్లు, నను గావుము మోహపు సంకెలల్ విడన్!! 69

ఆత్మ హితము గ్రహింప లేని దశరథుడు, సత్యమునకు (తానెప్పుడో కైక కిచ్చిన వరములకు) భంగము కలుగునను భావముతో, కైక కోరికను ఔనని కాని, కాదని కాని, మారుపలుక మానినను, ఇంద్రియ సమూహము జ్ఞానమును కట్టివైచినట్లు, కైక మాత్రము తన పట్టు విడువదాయెను. నన్ను మాత్రము మోహపు సంకెల వీడిపోవునట్లు కాపాడుము.

చం॥ నిను నెడబాసి యొంటి మన నేరని సీత మనం బెఱుంగవో
వనములకీవు రాఁదగదు ప్రాణసఖీ యని బోధసేయ; నీ
మనము బలంబు వాసి యనుమానము లే దఖిలంబుఁ దానయై
మనుటను, నామె లేక యెటు మార్కొనఁ జూచితో రాక్షసావళిన్॥ 70

నిన్ను విడిచి ఒంటరియై జీవింపలేని సీత మనస్సు నీకు తెలియదా? నీ వరణ్యములకు రాతగదని యేల పల్కితివి ? నీ మనస్సు, బలము, కీర్తి – ఒకటేమి సకలము తానే అగుటచే, ఆమె లేక దానవ సమూహమును ఎట్లు ఎదుర్కొనఁ దలచితివి ?

"శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి" -సౌందర్యలహరి

శివుడు శక్తితో కూడినపుడే శక్తిమంతుడు (సమర్థుడు) అగుచున్నాడు. శక్తితో కూడనపుడు, కదలుటకు సైతము అశక్తుడే కదా! కనుక తన శక్తి యగు సీతామహాదేవిని కాదని రాముడు శక్తిమంతుడు కాజాలడు. సీత సకలమునకు కారణమైన మహాప్రకృతి. ఆమె కారణముగనే రాక్షస సంహారము జరిగినది. మఱియు వాల్మీకియే "సీతాయా శ్చరితం మహత్" అని రామాయణము సీత చరిత్రమనియే పేర్కొనెను.

చం॥ అవనిజ తోడురా, నసురలందు భయంబును, మౌని వాటికా
నివహములందు సంతసము నెక్కొనెఁ గానలఁ; జంద్రబింబ సం
భవ మధుర ప్రసన్న రుచి బాధయు మోదము గూర్చునే కదా!
అవగతమయ్యె నీ యెడఁద కామె శరీరము గూర్చు టెంతయున్॥ 71

భూజాత యగు సీత నీ వెంట రాగా అసురలకు భయమును, మునుల కుటీరములందు సంతోషమును, కల్గినవి. చంద్ర బింబమునుండి

వెలికివచ్చు తీయని మనోజ్ఞమగు కాంతి కొందఱికి ఆర్తిని, కొందఱికి ఆనందమును, చేకూర్చుట సహజమే కదా! ఇంతకు నీ భావమునకు ఆమె చక్కని ఆకృతిని కూర్చుననుట అర్థమైనది, పరమేశ్వరుని సంకల్పము ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులవలన వ్యక్తమగుననుట.

ఉ॥ నీ యనుజన్ము వోలె, నను నీ యనుయాయిగఁ గొంచుపొమ్ము శ్రీ
నాయక! త్రెంచికొందు నిఁక నా భవబంధము లొక్కటొక్క సే
పాయక నీదు సేవలఁ గృపామతి! నీ చిఱుకాన్క నాకెడం
జాయని దివ్యభోగ్యమగు భాగ్య, మలభ్య పదంబునౌఁ గదా॥ 72

నీ సోదరుడగు లక్ష్మణుని వలె నన్ను నీ వెంట తీసికొనిపొమ్ము. శ్రీపతీ! నీ సేవలలో నా జన్మబంధముల ఒక్కొక్కదానినే త్రెంచికొందును. దయామతీ! నీ విచ్చెడి యీ చిఱు కానుక, నా విషయమున దేవతలచే అనుభవింపదగిన భాగ్యముగను, దొరకని యున్నత స్థానముగను అగును.

మ॥ తమసా తీరమునందు నీ ప్రకృతి నిద్రాబద్ధమై యుండఁ ద
త్సమయం బారసి జానకీ రమణితో, సౌమిత్రితో వాహినీ
విమలాంబు క్రమణం బొనర్చితివి; నే విద్యా విహీనుండ, నా
తమముం బాపుము, జాగరూకత మెయిన్ ధర్మంబు వెన్నంటెదన్॥73

నీ వరణ్యముల కేగుచుండ నిన్ను వీడలేని నీ ప్రకృతి (పౌరులు) నీ రథము వెంట తమసానది వఱకు వచ్చి, రాత్రి యగుటచే ఆనదీతీరమున నిద్రించు సమయమున, సీతాలక్ష్మణులతో నదిని దాఁటి ముందు కేగితివి. నేను విద్యా (ఆత్మజ్ఞాన) హీనుఁడను. నా తమస్సును (అజ్ఞానమును) పోగొట్టుము. మేల్కొనినవాడనై ధర్మము ననుసరించెదను.

ప్రకృతి అనగా బ్రహ్మాండమున మాయ; పిండాండమున అవిద్య. అది తమస్సు (చీకటి) వంటిది. అందునను, నిద్రాబద్ధమైనది. జాగరూకత కలవాడే. పరమాత్మను అనుసరించి పోగలడు. ఇతరునికి అది అసాధ్యము. సీత మూలప్రకృతి లేక అభిన్నశక్తి అగుటచేతను, లక్ష్మణుడు నిరంతర నిర్నిద్రుడు కనుకను, రాముని అనుసరించిరి. ఇతరులు ప్రకృతి భావమును (మాయను) దాఁటలేక రాముని అనుసరింప జాలరైరి. "యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ" — భగవద్గీత.

చం॥ దశరథుఁడీవరణ్యములఁ దాపసి చందమునన్ వసింపఁ దాఁ
బశువటు స్వాపరాధమునఁ బ్రాణములన్ విడనాడె వేదనన్
విశదము సేయలేని యెద ప్రీల, స్మరించి స్మరించి నిన్నె; నీ
వశమున నాదు ప్రాణములు భద్రము లౌటఁ దలంప నాక్రియన్॥ 74

తాపసి వలె నీ వరణ్యములలో వసింప, దశరథుడు తన అపరాధము కారణముగ, తెలుపజాలని బాధతో, హృదయము బ్రద్దలుకాగా, నిన్నే స్మరించుచు ప్రాణములు వీడెను. నా ప్రాణములు నీ స్వాధీనమున భద్రములై యుండుటచే, నే నావిధముగ భావింపను. నీ రక్షణములో నున్న నాకు అమృతత్వమే సిద్ధించునని ఆకాంక్ష.

యజ్ఞదత్తుడను ఒక మునికుమారుడు వృద్ధులు అంధులు అయిన తన తల్లి దండ్రుల కొఱకు సరయూ నదిలో నీరు ముంచుచుండ, దశరథుడాధ్వని విని ఏనుగను భ్రాంతిచే, బాణమున ఆతని హతుని చేసెను. అనంతరము యజ్ఞదత్తుని తల్లిదండ్రు లావృత్తాంతము విని, "నీవును మావలె పుత్ర శోకమున మరణింపు" మని శపించిరి. ఇది ఆతని స్వాపరాధనము.

పశువు అనగా–1 నోరు లేని జంతువు. తన బాధను తెలుపజాలనిది. 2. అజ్ఞానావరణము కల జీవి. దశరథుని పరిస్థితి రెండు విధముల సరిపోయినది.

ఉ॥ గంగను దాఁటుచో గుహుఁడొకండు సహాయ మొనర్చెనంట దు
ష్పంగత, మీవె జీవులకు సంసృతి సాగరము న్తరింపఁగా
పంగతివౌట; నేఁడు భవ సాగరమందు మునింగి తేల నె
ట్లంగి సముద్ధరింతొ నను, బ్రార్థన సేయుదుఁ దారకప్రభూ॥ 75

నీవు రాజ్యమును పరిత్యజించి అడవుల కేగునపుడు గుహుడను ఆటవిక రాజు గంగను దాఁటుటందు నీకు సహాయ పడెననుట అసంగతము. ఓ తారకరామా! సంసార సాగరము తరించుటకు జీవులందఱకు నీవే శరణ్యము కదా! నేడు పుట్టుక అనెడి కడలిలో మునిగి తేలుచున్న నన్నే విధముగ ఉద్ధరింతువో ? నిన్ను ప్రార్థించుచున్నాను.

శా॥ నీకున్ భూమిజకున్ సభక్తికముగా నిత్యార్చనల్ సేయగా,
నీ కైంకర్యము స్వీయ జీవనముగా నెక్కొల్పి, సౌమిత్రి దా
నేకర్మాచరణం బొనర్చెనొ కదా! ఏ నొక్కమారేని నిన్
సాకల్యంబుగఁ బూజచేసి గొలువన్ స్వాస్థ్యంబు చేకూర్పుమా॥ 76

నీకును సీతకును భక్తిపూర్వకముగా నిత్యము అర్చనలు సేయుట కును, నీ సేవయే తన జీవనముగా పెట్టుకొల్పుటకును, సుమిత్రా సుతు డగు లక్ష్మణుడు, ఏకర్మల నాచరించెనో కదా! ఒక్క పర్యాయమైనను నిన్ను పరిపూర్ణముగా అనగా స్వస్వరూపానుసంధానముగలిగి, పూజ చేసి సేవించుటకగు నెమ్మది నిమ్ము.

భగవంతునియందు భక్తి ప్రపత్తులు కలుగుటకు సంస్కార మావ శ్యక మనియు, "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" – (వివేక చూడామణి) అని యుండుటచే స్వస్వరూపముతో అనుసంధానము కల్గిన భక్తియే శ్రేష్ఠ మనియు భావము.

శా॥ నీకుం బ్రాణము లిచ్చు సోదరునితో, నీ యాత్మయే తానుగా
నేకంబౌ సతితో, నరణ్యములయందే సౌఖ్యముల్ గాంచు నీ
కా కష్టంబులు ? జానకీ యుతుఁడవై, కాంతారవాసక్రియన్
లోకాలం దిరుగాడు నన్నుఁ గృప నాలోకింపఁ బ్రార్థించెదన్॥ 77

నీకొఱకు తన ప్రాణములనిచ్చు సోదరుడు లక్ష్మణునితో, నీ యాత్మయే తానైన ప్రియసతి సీతతో అడవులలో నున్నను సుఖ మనుభవించు నీకు కష్టములా ?! నమ్మ జాలను, అడవులలో నివసించుచున్నట్లు పలులోకము లలో దిరుగుచు, ఒంటరినైన నన్ను, జానకీ సహితుడవై వచ్చి, దయ జూడుము,

రామ రావణ యుద్ధములో రామునికొఱకు తన ప్రాణముల నిచ్చి హనుమంతుడు తెచ్చిన సంజీవనివలన లక్ష్మణుడు పునర్జీవితుడగుట విదితమే కదా! లక్ష్మణుని త్యాగశీల మట్టిది.

చం॥ మునులను బల్కరించుచు, నపూర్వ మనోహర కాననంబ నీ
మునికిగఁ జిత్రకూటమున నుండవొ సజ్జన రక్షణార్థమై;
మనమున సాధు భావముల మన్ననసేయుచు వచ్చి, నాదు జీ
వన వనమందుఁ బర్ణకుటి వైచి వసింపుము నా యెడందలో॥ 78

మునులను పల్కరించుచు చక్కని ప్రకృతి దృశ్యములుగల అరణ్యమునే నివాసము చేసికొని, సజ్జనులను రక్షించుటకై నీవు చిత్రకూటమున వసింపలేదా? అట్లే మనస్సులోని మంచి భావముల నాదరించుచు వచ్చి, నా జీవనమను వనమందు నా హృదయములో పర్ణకుటీరము వేసికొని నిల్వుము.

శా॥ ఆదేశింపని తండ్రి మాట గొని నీ వారణ్య సంవాసిగా,
నాదేశించిన తల్లిఁ గాదనియె నత్యార్తిన్ భవత్సోదరుం,
డేదైనం బితృవాక్య పాలనమె సుధ్యేయంబునాఁ జెల్పి, నీ
వాదేశింపవె నాఁడు నీ యనుజు; న న్నారీతి బోధింపవే॥ 79

స్వయముగ ఆదేశింపని తండ్రిమాట నిల్పుటకు నీ వడవులు చేరగా, త న్నాదేశించిన సొంతతల్లి, కైక మాటను కాదని నీ సోదరుడగు భరతుడు మిక్కిలి బాధపడెను. ఏదైనను పితృవాక్యపాలనమే. అదే మన ధ్యేయమని నీ వానాడు నీ సోదరునికి నచ్చజెప్పినట్లే, నాకును కర్తవ్యమును ప్రబోధింపుము.

మ॥ పతివంచున్, క్షితిఁగల్గు భూభుజుల సంభావించి శాసించు భూ
పతి వంచున్, మతిమంతుఁ డంచుఁ, బ్రకృతిం బాలించి రంజించు స
త్కృతి వంచున్, భరతుండు నిన్మరలి సాకేతంబు రావేడఁ ద
ద్గతి నీ పాదుక లంచు నిచ్చుఁ బరమాత్మున్ నిన్నె భావించెదన్॥ 80

రాజువని, అవనియందలి రాజుల గారవించి అదుపులో నుంచగల రారాజువని, బుద్ధిమంతుడవని, పౌరుల పాలించి ఆనందింపజేయగల నేర్పరివని, భావించి, నిన్ను సాకేత నగరమునకు మరలి రమ్మని భరతుడు ప్రార్థింపగా, "నీకు నా పాదుకలే గతి" యని యిచ్చు పరమాత్ముడవగు నిన్నే భావించెదను.

నాకును గతి చూపుమని ధ్వని.

చం॥ అటవుల సాధు జీవన జనావన దీక్ష వహించి, దానవో
త్కట విషకంటకాగముల ఖండనచేసి, ఋషీంద్ర నిష్కుటీ
పటలము ధర్మబీజముల పాదులు ప్రోదులు సేయు నీకు, న
గటకట పెట్టు క్రోధమును ఖండనసేయ నసాధ్యమౌనొకో! 8

అడవులలోగల సాధుజీవనములను రక్షించు దీక్షను పూని, రక్కసులనెడి బలు రక్కసి ముండ్ల చెట్లను నిర్మూలించి, సత్యదర్శనులైన మునుల కుటీరములలో ధర్మబీజముల పాదులను రక్షణసేయు నీకు, నన్ను వేధించు కంటక ప్రాయమైన కోపమును తొలగించుట అసాధ్యము కాదు. దానిని పోగొట్టుము. "ఋషయో మంత్ర ద్రష్టారః" (ఋషులు మంత్ర ద్రష్టలు) - యాస్కుని నిర్వచనము.

ఉ॥ దండక సొచ్చి, దానవుల దౌష్ట్యములం దొలగింపఁ గాపురం
బుండవె శిష్టులం గలసి, యోర్పున నేర్పున విఘ్నకారులం
జెండుచు; నట్లె నా హృదయ సీమను నిల్చి ప్రతీప బుద్ధులన్
దండనసేయు మయ్య, మది ధర్మువునన్ సమసింప నచ్యుతా॥ 82

ఓ అచ్యుతా! దండకారణ్యమున ప్రవేశించి రాక్షసుల దుష్కృత్యముల హరించుటకై సజ్జనులతో కలసి కాపురముండి, ఓర్పుతో నేర్పుతో విఘ్నముల చేయు రాక్షసగణమును సంహరించినట్లు, నా హృదయసీమను నిల్చి, ప్రతికూల బుద్ధులను దండించి, నా మనస్సు ధర్మమునందే లీన మగునట్లు చేయుము.

ఉ॥ క్రూర విరాధ రాక్షసునిఁ గూలిచి శాప విముక్తిఁ గూర్చుచో,
నీరధి వోలె జ్ఞానమయ నీరధిఁ బుక్కిటఁ బట్టి వట్టి వి
ద్యా రమణీయుఁ గుంభజుని నాదర మొప్పఁగ గారవించుచోఁ,
జేసిన నీ దయా మధుర శీకరముల్ గురిపింపు నా పయిన్॥ 83

క్రూరుడైన విరాధుడను రాక్షసుని సంహరించి వానికి శాప విముక్తిని కల్గించినపుడును, సాగర జలమును త్రాగినట్లే, జ్ఞానరూపమగు సాగరమును పుక్కిట బట్టిన శ్రీవిద్యోపాసకుడగు అగస్త్యమహామునిని ఆదరముతో గారవించినపుడును, ఏ దయామధురములైన తుంపురులను వారిపై కురిపింప జేసితివో, వానిని నాపై కూడ ప్రసరింపజేయుము.

తుంబురుడను గంధర్వుడు కుబేరుని శాపమున విరాధుడుగా పుట్టి, సీతా రామ లక్ష్మణులు దండకారణ్యమున పోవుచుండ, జానకిని అపహరింప జూచెను. అంత రామలక్ష్మణులు వానిని సంహరింపగా అతడు శాప విముక్తుడై శరభంగ మునిని దర్శింపుడని వారికి చెప్పి, తన మార్గమున పోయెను.

అగస్త్యమహాముని దేవతలు ప్రార్థింప సముద్ర జలమును పానము చేసెను. అంత సముద్రమున దాగిన కాలకేయులనెడి రక్కసులు బయట పడ, దేవతలు వారిని వధించిరి. అగస్త్యుడు శ్రీవిద్యో పాసకులలో ప్రముఖుడు. రాముడు వనవాస సమయమున తన ఆశ్రమమునకు రాగా, అగస్త్యుడు ఆయనకు అతిథ్యమిచ్చుటేగాక, దివ్య ఖడ్గమును, ధనుస్సును ఇచ్చెను. యుద్ధసమయమున కూడ రామునికి ఆదిత్యహృదయము నుపదేశించి, వానిని ప్రోత్సహించెను.

ఉ॥ స్వర్గము నిచ్చగింప శరభంగుని వోలె, సురాధినాథుఁడే
మార్గముఁజూప వచ్చిన, విమానము దెచ్చిన నేని; భోగ సం
సర్గము చావు పుట్టువుల చక్రపరిభ్రమణంబు కావునన్
నిర్గుణు మోక్షు మోక్షగతి ని న్దరిసించి తరింపఁగోరెదన్‌॥ 84

శరభంగుని వలె నేనును స్వర్గసుఖముల కోరను. భోగలాలసత చావు పుట్టువుల చక్రమున త్రిప్పును గనుక, గుణత్రయ సంబంధము లేనట్టియు, మోక్షరూపుడవైనట్టియు, మోక్షమార్గముకూడ అయిన నిన్ను దర్శించి తరింప దలచెదను.

పునర్జన్మకు బీజమైన కర్మను ముందుగనే వశింపఁజేసికొన్నను, శ్రీరాముని దర్శనమగుదాక, తనువును నిల్పుకొని, ఆవల తృప్తితో శరీరమును భంగము చేసికొనినవాడు శరభంగుడు. ఈ మహాముని తపస్సునకు మెచ్చుకొని అతనిని స్వర్గమునకు తీసికొనిపోవుటకు స్వయముగ ఇంద్రుడు తన విమానముతో వచ్చెను. కాని రామునిచూచుటకై ఇంద్రునితో వెళ్లుట కాయన నిరాకరించెను. రామదర్శనానంతరము సుతీక్ష్ణుడను మునిని చూడుడని చెప్పి యోగాగ్నిలో శరీరమును వీడెను.

ఉ॥ ఎందఱొ మౌని పుంగవు లహీన తపో మహిమాన్వితుల్, గృపా
సింధులఁ బ్రోవఁ బంచవటిఁ జేరి వసించిన నీకు, నేఁడు నీ
ముందటె నిల్చి, త్వచ్చరణముల్ శరణంబుగ నెంచి మ్రొక్కు నా
యందు దమకంపఁ జూపఁదగదా రఘునాయక! ముక్తిదాయకా॥ 85

రఘునాయకా! ముక్తిప్రదాయకా! తపోమహిమలుగల దయాసముద్రులైన మునిశ్రేష్ఠుల నెందఱినో రక్షించుటకు నీయంతట పంచవటిని

చేరిన నీకు, నేడు నీ యెదుటే నిల్చి, నీ పాదములే శరణ్యమని నమస్క రించు నాపయి దయచూపతగదా ? కోరని వారినే రక్షించుటకు వచ్చిన నీవు, నిన్నే యాచించెడి నన్ను కృపచూడ తగునని భావము.

ఉ॥ శూర్పణఖా మనోగత పశుప్రకృతిన్ వికృతంబు సేయఁగా
నేర్పున లక్ష్మణుం బనిచి, నిల్వవె కార్య సమీక్షకుండవై;
కూర్పుము రక్షణంబుఁ బ్రతికూల మనః ప్రకృతిన్ హరించి యో
దార్పుము నన్ను సంయమన ధర్మ పథంబున నిల్పి శ్రీపతీ॥ 86

లక్ష్మీనాయకా! రావణ సోదరియగు శూర్పణఖ మనసునగల పశు ప్రకృతిని (విచక్షణారహితమగు కామమును) వికృతము చేయుటకై నేర్పున లక్ష్మణుని నియోగించి అనంతర కార్యమును సమీక్షించుచు నిలువ లేదా ? ప్రతికూలమగు నా మనఃప్రకృతిని పోగొట్టి, నాకు రక్షణము గూర్పుము. నిగ్రహముతో కూడిన ధర్మమార్గమున నన్ను నిల్పుము.

మానవులలోగల అజ్ఞానమును (కామాది) తొలగించుటకు, రామాను జాచార్యుల బంపి జగత్తు నుద్ధరించిన వాడవని ధ్వని.

మ॥ బలసంపన్నుల నా ఖరాదులను నీ బాణాగ్ని దగ్ధాంగులౌ
శలభ ప్రక్రియఁ జేసి మైచిన భవత్సామర్థ్యముఞ్జూపి, నా
వలనం గల్గిన క్రోధ లోభముల దుష్ప్రాబల్యము న్బాపవే
జ్వలియింపన్ భవదీయ తత్త్వమయ దీపజ్వాల యుద్దీప్తమై॥ 87

బలసంపద కలిగిన ఖరుడు దూషణుడు త్రిశిరుడు అను రాక్షసుల నీ బాణములనెడి అగ్నియందు మిడుతలుగాజేసి దహించివేసిన నీ సామర్థ్య మును ప్రదర్శించి, నీ తత్త్వమే దీపజ్వాలయై దేదీప్యమానముగా జ్వలింప నాలో క్రోధ లోభాదుల చెడ్డ ప్రాబల్యమును పోగొట్టుము.

క్రోధ లోభాదులు కామము ననుసరించి వచ్చునవే కనుక, కామ ప్రకృతియగు శూర్పణఖకు సోదరులే. కవుననే శూర్పణఖ సహాయార్థము ఖరదూషణాదులు వచ్చి రామునిచే సమసిరని భావము.

ఉ॥ నీచపు మృత్యువున్ వెఱచి, నీ కరముక్త శరంబ కోరు మా
రీచుఁడు స్వామికార్యమునఁ బ్రేషితుఁడై నిను మభ్యపెట్టుచో,
నేచిన జన్మ బంధముల నెల్ల హరించి విముక్తిఁ గూర్పవో!
దాచగనేల ? నీ చరణ దాసుని నగ్గరుణించు టొప్పదే॥ ౪౪

రావణునిచే నీచముగ చచ్చుటకంటె నీ చేతినుండి విడువబడిన బాణముచే చచ్చుట మేలని, ప్రభుకార్యమున పంపబడి, నీకు భ్రాంతిని కల్పించిన మారీచుని జన్మబంధములు తొలఁగగా, వానికి విముక్తి నొసఁగితివి కదా! దాచు టెందులకు ? నేను మారీచునివలె విరోధిని కాను. నీ చరణ దాసుడను. నన్ను దయచూడ తగును.

చం॥ పరువము నీషణత్రయము బంగరు లేడిని పోలి నా మదిం
గరము భ్రమింపఁ జేయఁ గుతుకమ్మును విస్మృతి యావహింప నే
నరిగితి గమ్యమున్ విడిచి, యంతయు మిథ్య యటంచెఱింగి, నీ
శరణము సొచ్చితిన్, శరముఁ సంధిలఁజేయుము వీరరాఘవా! ౪౫

వీరరాఘవా! యౌవనము, దారేషణ ధనేషణ పుత్రేషణలను ఈషణత్రయము, బంగరు లేడి వలె నా మనసును మిక్కిలి ప్రలోభపెట్టగా, ఆసక్తి ఆత్మవిస్మృతి నన్నావహింపగా, గమ్యమును విడిచివెళ్ళితిని. ఇపుడవియన్నియు మిథ్య (లేనిది) అని తెలిసి, నీ రక్షణము కోరితిని. ఇక నీవు వింట బాణమును సంధింపుము. ఆ మాయలేడి నశింప గలదు.

"సంగాత్ జాయతే కామః కామాత్క్రోధోభిజాయతే
క్రోధాత్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః" - భగవద్గీత.

చేరిక లేక సంగము వలన కోరికయు, కోరికనుండి కోపమును, (కోరినది లభింపనపుడు), కోపమునుండి సమ్మోహమును, (వివేకము లేని ఆసక్తి), దానివలన స్మృతిని (బుద్ధిని) కోల్పోవుటయు, కలుగును. విస్మృతి అనగా స్మృతి భ్రంశము –తానే బ్రహ్మమన్న బుద్ధివృత్తి లేకుండుట. మిథ్య అనగా లేనిది-ఇంద్రియముల కగుపించుచు విచార దృష్టితో చూచినపుడు లేనిది - అనగా మాయ.

ఉ॥ మోహము దాచి, పర్ణకుటి ముందు యతీంద్రుని వోలె నిల్వ, వై
దేహియు నర్చ సేయఁ జనుదెంచి, నిశాటు దశాననంబులన్
బాహులఁ జూచి మూర్ఛగొన, భామిని రావణుఁ డట్లె నిర్దయన్
వ్యూహముచేసి గొంచుచనె వ్యోమ పథంబున లంకఁ జేర్పగా॥ 90

వలపు తెలియనీయక, యతి రూపమున పంచవటియందలి పర్ణకుటీరముముందు నిలిచిన రావణుని నిజమగు ఋషియని తలచి, అర్చించుటకు వెలుపలికి వచ్చిన సీత ఆతని నిజరూపమును అనగా పది తలలను, ఇరువది చేతులను చూచి, మూర్ఛపోవ, దానవుడు నిర్దయుడై వ్యూహము ప్రకారము, ఆమెను తీసికొని ఆకాశ మార్గమున లంకదిశగా వెళ్ళెను.

ఉ॥ కాయిక సౌఖ్యమే పరసుఖంబను భ్రాంతి వహించి, సక్తిమై
దాయఁగ నాదరింప, వికృతంబగు కామము భీకరాకృతిన్
మాయను జూపి, బల్మి గొనె మానసమున్ స్మృతి గోలుపోవ; నీ
వీయెడ బంధమోచనము నేగతి దానికిఁ గూర్తువో ప్రభూ! 91

మనస్సు, శారీరక సుఖమే పరమ సుఖమను భ్రాంతితో ఆసక్తితో ఆదరింపరాగా, కామము తన అసహ్యమగు భయంకరాకారమును జూపి, మాయను ప్రదర్శించి, స్మృతి గోలుపోయిన మతిని చెఱపట్టినది. ఓ ప్రభూ! నీ విపుడు దాని చెఱ నెట్లు విడిపింతువో?

శారీరక సుఖమునే పరసుఖముగా భావించువాడు అంతః శత్రువులకు చిక్కుననని, విముక్తికి భగవంతుని అనుగ్రహము ఆవశ్యకమని భావము.

చం॥ ప్రియపతిఁ బాసి దుఃఖమున వేమఱు నీ వెలుగెత్తి పిల్వగా
స్వయముగ శైలముల్ పిలిచె భామినిఁ దాము గహర్వంబులన్,
రయమున నిర్ఝరుల్ వఱచి, రాల శిరంబులు గొట్టుకొంచు దు
ర్ణయమున కాత్మఁ గ్రుంగఁగఁ, దిరంబుగ సాగెను కాలమొక్కటే॥ 92

ప్రియపతి నెడబాసి నీవు దుఃఖముతో అనేక పర్యాయములు గొంతెత్తి జానకిని పిలువగా, చుట్టుగల పర్వతములు కూడ గుహలనెడి

నోళ్ళతో నీ రోదనమును ప్రతిధ్వనించుట ద్వారా, స్వయముగ తాము ను ఆమెను పిలిచి, తమ సహవేదనను తెలిపినవి. సెలయేళ్లు పరుగున పోయి రాలకు తమ శిరముల గొట్టుకొనుచు జరిగిన అన్యాయమునకు క్రుంగిపోయినవి. కాని స్థిరముగ ఒక్క కాలము మాత్రమే ముందుకు సాగినది.

సర్వాంతరాత్మ యగు ఈశ్వరుని భావము (ఇచట రాముని వేదన) ప్రకృతియందలి ప్రతి వస్తువున ప్రతిఫలించుననియు, ఎవ రెంత బాధ పడినను నియతమగు కాల మాగునది కాదనియు, విధి నిర్ణయము అనుల్లంఘనీయ మనియు, భావము.

చం॥ ప్రియసఖి లేని జీవితము పేర్కొనరానిది, చూడు మంచు నా
ప్రియసతి మృత్యు దష్టయయి వే చనఁజేయఁగ లేదుగా; దయా
మయుఁడవు, నాకు మోక్షమిడ, మామక బంధము లొక్కటొక్క పే
నియతినిఁ దీసివైచు టిది నీ హృదయంబన సాహసించెదన్॥ 93

ప్రియభామిని లేని జీవితము చెప్పరానిది సుమా! నీవే చూడుమని నా ప్రియసతిని మృతురాలిని చేయలేదుకదా? నీవు దయామయుడ వగుటచే, నాకు మోక్షమిచ్చుటకై నాబంధముల నొక్కొక్కదానినే క్రమముగా తొలగించుట నీ హృదయమని పలుక సాహసించెదను.

ఉ॥ పోయిన నా వివేకమును బోల్చుకొనన్ శ్రమియింతు నింక, నీ
కా యటవీస్థలిన్ దశముఖాపహృతావనిజా చరిత్రమున్
జ్ఞేయము చేసె నొక్క పతఁగేశుఁడు; నాదగు జ్ఞాన మెప్పుడే
చాయలఁ బోయెనో దెలుపఁజాలు జటాయువు లేఁడు నేఁ డిటన్ 94

నీ కా యరణ్యములో రావణునిచే అపహరింపబడిన సీతా వృత్తాంతమును ఒక పక్షిరాజు తెలియజేసెను. కాని నా జ్ఞాన మెప్పు డెచ్చట జారినదో తెలుపుటకు, ఈ జనపదములలో, ఒక జటాయువుకూడ నేడు కన్పింపడు. కనుక పోయిన నా వివేకము ను పోల్చుకొనుటకు ఇక నేనే యత్నించెదను.

జటాయువు దశరథుని మిత్రుడైన ఒక పక్షిరాజు. సంపాతి సోదరుడు. రావణుడు సీత నెత్తికొని పోవుచుండ ఆమెను రక్షించుట కాతనితో యుద్ధముచేసి. వానిచే ఱెక్కలు నఱుకబడి, రాముని రాకకొఱకు కొనయూపిరితో నుండి, రాముని కావార్త తెలిపి ప్రాణముల వీడెను. రామలక్ష్మణు లాతనికి అగ్ని సంస్కారము చేసిరి.

మ॥ శబరీదత్త ఫలంబుగాఁ దలఁచి, యాశాతప్త కర్మంబు నీ
కుబుసుల్ సెప్పుచు నీయజంకునెడ నా యొచ్చెంబు వోజేయుచుం
గబళింపంగదవయ్య కర్మఫలమున్, గాదేని, యీ జన్మలో
నభయంబున్ దయసేయు చాలుఁ, గరుణాయత్తైక చిత్తుండవై 95

ఆశతో ప్రమగ్గిన నా కర్మఫలమును, నీకు ముచ్చటలు చెప్పుచు ఇచ్చుటకు జంకునపుడు, శబరిచే నీయబడిన ఫలముగా భావించి నాన్యూనతను పోగొట్టుచు నీవే దానిని తీసికొని భుజింపుము. కానిపక్షమున దయాహృదయుడవై ఈ జన్మమున నా కభయమిమ్ము. అంతే చాలును.

శబరి ఒక బోయెత. ఆమె యోగనిష్టచే సమాధిలో చేరదలచియు శ్రీరాముని చూచు కోర్కెతో జీవించియుండెను. శ్రీరాము డామెను చూడ రాగా, వానికిచ్చుటకు మధురములగు ఫలముల సేకరించి తెచ్చి సమర్పించి, సంతృప్త హృదయముతో అగ్నిని కల్పించుకొని శరీరత్యాగము చేసిన భక్తురాలు.

మ॥ శిరముం గాళులు లేని నా మనసు, దుశ్శీలంబు వ్యామోహమే
కరముల్‌గాగ, బిగించిపట్టె దురహంకారంబుతో జ్ఞానమున్;
గరుణన్ దాని "కబంధహస్తముల" నీ ఖడ్గప్రహారంబులన్
నఱుకన్ రమ్ము; శరణ్య మీవ జగదానందైక సంధాయకా॥ 96

తలయు కాళ్ళును లేని (వివేక చైతన్యము లేని) నా మనస్సు చెడ్డప్రవర్తన వ్యామోహములనెడి చేతులతో, దురహంకారము చూపి, జ్ఞానమును బిగించి పట్టుకొనినది. దయతో దాని కబంధహస్తములను నీ ఖడ్గముతో నఱుకరమ్ము. జగమున కానందముగూర్చువాడా! నీవే శరణ్యము.

కబంధుడొక రాక్షసుడు. ఇతనికి తలయు కాళ్ళును లేవు. చేతులు మాత్రమే కలవు. ఆ చేతులతో చిక్కినవారిని భుజించెడివాడు. సీతను వెదకుచు వచ్చి రామలక్ష్మణులు వీనికి చిక్కిరి. కాని వారు వాని హస్తముల ఖండించుటచే, అతడు హతుడై తాను దనువనువాడ ననియు, శాప వశమున నట్లయితి ననియు చెప్పి తన దేహమును దహింపుడని కోరెను. రామలక్ష్మణు లట్లు సేయగా, దివ్యరూపమున వారికి కన్పించి, సుగ్రీవునితో మైత్రి చేయుడని చెప్పి పోయెను.

చం॥ అతులిత శక్తిమంతుఁడు, మహామతిమంతుఁడు, కాంచనస్ఫురత్
ద్యుతియుతుఁడాత్మసంయమి,మహోజ్వల దివ్యపరాక్రముండు, సు
స్థితుఁడగు జ్ఞానవిత్తముఁడు, ధీరుడు, సద్గుణి, యంజనాసుతుం
డతనికె చెల్లు నిన్నెఱుంగ! నల్పుఁడ నా కెటు సాధ్యమయ్యెడిన్? 97

సాటిలేని మేటి శక్తిగలవాడు, సునిశితమైన బుద్ధిగలవాడు, బంగారమును తలపింపజేయు శరీరచ్ఛాయ గలవాడు, ఆత్మ నిగ్రహము గలవాడు, గొప్పదగు దివ్య పరాక్రమము గలవాడు, జ్ఞానధనము కలవాడు, మంచి గుణములు కలవాడు, అగు అంజనా సుతుడైన హనుమంతుడే నిన్నెఱుగ సమర్థుడు. అల్పుడనైన నా కెట్లు సాధ్యమగును.

శక్తిమంతమై స్థిరమయిన మనస్సు, సూక్ష్మగ్రాహకమై నిశ్చయాత్మకమైన బుద్ధి, బ్రహ్మచర్యముచే సుసంపన్నమైన వర్చస్సు, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము, నిగూఢమైన పరతత్త్వము తెలిసికొను సామర్థ్యము, జ్ఞాన సంపద, ధైర్యము, సద్గుణ విశేషములు గలవారే నిన్ను తెలిసికొన నర్హులని భావము.

ఉ॥ వాలికి నోడి, శౌర్యమున వాడి, మతంగ మహీధరంబుపైఁ
గాలము పుచ్చు భానుజునిఁ గావవె నీవలువచ్చి, నేఁడు న
న్నేలుము జన్మదుఃఖముల యేపున కోడి విరాగమ న్మహా
శైలము నాశ్రయించితిఁ, బ్రసన్నుఁడవై యభయప్రదాతవై। 98

వాలి బలమునకు లొంగిపోయి, పరాక్రమమందు వాడిపోయి, మతంగ

(ఋష్యమూక) పర్వతమునెక్కి, ఎట్లో కాలముపుచ్చుచున్న సుగ్రీవుని, నీవయి వచ్చి రక్షింపలేదా? అట్లే నేడు జన్మదుఃఖముల ఆధిక్యమునకు ఓర్చుకొనలేక, విరాగమను గొప్పపర్వతము నాశ్రయించి ఉన్నాను. నా యందు ప్రసన్నుడవై, నా కభయమిచ్చి, నన్ను పాలింపుము,

ఋష్యమూక పర్వతము నెక్కినచో వాలి మరణించునని మతంగ ముని శాపము గలదు. కనుక సుగ్రీవునికది సురక్షిత ప్రదేశమయినది. వైరాగ్యమును సుఖ దుఃఖములు చేరలేవు కనుక, నా విషయమున వైరాగ్యముకూడ సురక్షకమే. అయినను దాని సుస్థిరత నమ్మరానిది. కనుక నీవు చేయవలసిన దంతయు, సుగ్రీవునికివలె మోక్షకామినైన నాకును అభయమిచ్చి వాలిని చంపినట్లు నా సంసారదుఃఖమును పోనడచి శాశ్వత ముగ భద్రతను చేకూర్చుటయే.

ఉ॥ తాడులం ద్రుంచి నా శరము దప్పదు లక్ష్యముఁ జీల్చుటందు, నీ
వోడకు మంచు సూర్యసుతు నోముటదెంత? రఘూత్తమా! నిను
న్వేడిన, జన్మబంధము లవే తెగిపోయి విముక్తి గల్గదో!
వాఁడిశరంబుకంటె కడు వాఁడిగదా భవదీయ నామమే॥ 99

ఏడు తాటిచెట్లను ఒకే బాణముతో పడగొట్టి, నా బాణము లక్ష్యమును భేదించుటందు తప్పిపోదు. నీవు సంశయింపకుము. అని సుగ్రీవునికి నమ్మిక కల్గించి, వాని భయమును తీర్చి రక్షించుటెంతపని? ఓరఘు వంశోత్తమా! నిన్ను వేడినచో జన్మ బంధములు తమంత తామే తెగి పోయి, విముక్తి కలుగుటలేదా? పదునైన బాణముకంటె నీ పేరే మిక్కిలి పదునైనది.

చం॥ హరిహర పద్మజాంశభవుఁడైన కపీంద్రుని సేవలందు, నీ
పరమ మహత్వముల్ దెలియఁ బల్కుట నా కెటు సాధ్యమౌను? దు
ర్భర భవతాప సంహరణ భాసురమౌ భవదీయ నామ సం
స్మరణము లేక, యన్యముల సార్థకమౌనె భవంబు? హ్రుత్పతీ! 100

బ్రహ్మ విష్ణు మహేశ్వరాంశములతో పుట్టిన హనుమంతునిచే సేవింప బడు నీ గొప్ప మహత్వముల తెలియబల్కుట నాకు సాధ్యముకాదు. ఓ

హృదయాధీశ్వరా! భరింపశక్యముకాని సంసారతాపమును తొలగించు ఉజ్వలమగు నీ నామస్మరణమునగాక, ఇతరములవలన పుట్టుక సార్థక మెట్లగును ? కాదని సమాధానము.

ఉ॥ వాలినిఁ జంపి, రాజ్యమున వాని సహోదరు నిల్పి, యంగదుం
బాలనసేయ లేదె యువపాలక పట్టము గట్టి; అట్లె న
న్నేలును వక్రమార్గమున నేగు కుసంస్కృతిఁ గూలనేసి, స
చ్ఛీల విధేయమై వరగు జీవన పద్ధతి నిల్పి నా మదిన్॥ 101

వాలిని సంహరించి కిష్కింధారాజ్యమునకు సుగ్రీవుని రాజుగ చేసినను, వాలి పుత్రుడగు అంగదుని యువరాజు నొనర్చిన నీ రాజనీతిని స్మరింతును. అట్లే వక్రమార్గమున నడచు చెడ్డ సంస్కారమును గూల్చి, మంచి శీలముతో కూడిన జీవనపద్ధతిని నా మనస్సున నిల్పుము.

సుగ్రీవుడు తన దోషము లేదని ఎంత చెప్పినను వినక, తమ్ముడని తలపక, వానిని రాజ్యమునుండి వెడలనడచుట, అతనిని చంపుట కితరుల ఋష్యమూక పర్వతమునకు పంపుట, సుగ్రీవుని భార్యయగు రుమను తా ననుభవించుట మున్నగు కార్యములు వాలి వక్రబుద్ధికి నిదర్శనములు. వానర నీతి ప్రకారము చనిపోయినవాని రాజ్యమును, భార్యతోనహా, జీవించియున్న ఆతని సోదరుడు అనుభవించుట ధర్మమే. మాయావితోటి యుద్ధమున వాలి మరణించె ననుకొనుటచేతనే కిష్కింధకు సుగ్రీవుడు ప్రభువై, వాలి భార్యయగు తారను చేరదీసెను. అట్లుగాక, బ్రతికి యున్న సుగ్రీవుని భార్యయగు రుమను వాలి అనుభవించుట అక్రమము. వాలికి తనకు ప్రత్యక్ష విరోధము లేకున్నను, దుష్ట శిక్షణము, శిష్ట రక్షణమున కవతరించిన రాముడు వాలిని చంపుట సమర్థనీయమే. "ధర్మో విగ్రహవాన్ రామః" రాముడు ధర్మస్వరూపుడు కదా!

చం॥ పతివి జగత్త్రయంబునకు. జాపురె! జానకి జాడెఱుంగలే
కితరుల సాయ మర్థిగొన నెంచితె ? కాదది, మాటతప్పి దు
ర్గతిఁ బడమన్న సూర్యసుతుఁ గావఁగ లక్ష్మణుఁ బంచితే మొ! నా
మతి గతి దప్పకుండ, ఋజుమార్గము చూపి, తరింపఁజేయవే॥ 102

మూడు లోకములకు అధిపతివి. సీతాదేవి ఉనికిని తెలిసికొనుటకు నీ వితరుల సాయముగోరుట వింతగ నున్నది. వాస్తవమేమన, ఆడిన మాట తప్పి దుర్గతిలో పడనున్న సుగ్రీవుని రక్షించుటకే లక్ష్మణుని అతని కడకు పంపియుందువు. అట్లే నా మతి తనగతిని తప్పకుండ సరియగు మార్గమును జూపి, నన్ను తరింపజేయుము.

రామ సుగ్రీవుల ఒప్పందము ప్రకారము శ్రీరాముడు వాలిని చంపి, సుగ్రీవుని రాజ్యమున నిలుపవలెను. ప్రతిఫలముగ సుగ్రీవుడు సీత ఉనికిని తెలిసికొని, ఆమెను రామునితో చేర్చుటందు సహాయపడవలెను. రాముడు తన కార్యమును నెఱవేర్చినను, సుగ్రీవుడే భోగలాలసుడై తనవంతు కార్యమున ఉదాసీనత చూపెను. ఆ విషయమును వానికి తెలిపి కర్తవ్య పరాయణుని చేయుటకై, లక్ష్మణుడు సుగ్రీవుని సౌధముముందు నిలిచి ధనుష్టంకారము చేసెను.

శా॥ ఆత్మేశున్ నిను దెల్పి నీ సతికి నాహ్లాదంబు సేకూర్పఁ బూ
తాత్ముం బావనిఁ బంపిన ట్లిపుడు నాయం దాదరంబొప్పగా
నాత్మజ్ఞాన వివేక దీధితుల నంతర్నేత్రమున్ విప్పు పు
ణ్యాత్మం బ్రేషితుఁ జేయువే సకల జీవానంద సంధాయకా! 103

సకల జీవులకు ఆనందమును గూర్చువాడా! ఆత్మేశ్వరుడవైన నీ వృత్తాంతమును నీసతి జానకికి తెలిపి, ఆమె కానందము కల్గించుటకై పవిత్రాత్ముడగు ఆంజనేయుని పంపినట్లు, నాయం దాదరముచూపి, ఆత్మజ్ఞాన వివేక కాంతులతో లోపలి కన్ను తెఱచు పుణ్యాత్ముడగు సద్గురుని పంపుము.

ఆత్మ విషయమును జీవునికి తెలిపి ఆనందము గూర్చువాడు గురువు. గురుకృపగల మానవునికే ఆత్మావలోకన సామర్థ్యము కలుగు ననుట.

చం॥ బలము జవంబుఁ దేటపడఁ బల్కిన, మారుతి మేను బెంచి, తా
జలనిధి దాఁటి వేచనియె జానకి జాడ నెఱుంగ; నేఁడు నా
తెలియని బుద్ధి నీ వెఱుఁగఁ దెల్పుము, నేనును జేరఁగల్గుదుం
బలుకుల కందరాని నిజభావము సత్య గవేషణంబునన్॥ 104

తన బలమును వేగమును జాంబవంతుడు మున్నగు వానర వీరులు తెలియజెప్పగా, హనుమంతుడు తన శరీరమును పెంచి, సముద్రమును లంఘించి, లంకయందు సీత నన్వేషించుటకు వెళ్లెను. నేడు అజ్ఞానావృతమైన నా బుద్ధిని తెలియజెప్పుము. సత్యాన్వేషణమందు నేనును వాక్కుకందని స్వభావమును చేరగల్గుదును.

సంపాతి (జటాయువు సోదరుడు) వలన సీత లంకలో కలదని విని వానరులు లంకలో ప్రవేశించుటకు సముద్ర మడ్డుకాగా, దానిని దాంటిపోగల సమర్థుండు మారుతియే యని వానిని కీర్తింపగా, హనుమ శరీరమును పెంచి సాగరమును లంఘించెను.

ఉ॥ సాగర లంఘనంబున నిశాటిని సింహికఁ ద్రుంచి లంకలో
వేగుగఁ జేరి, సౌధ మణివేశ్మము లారసి, యెట్టకేల కా
యోగిని సీతఁ గన్గొనియె, నోర్మి సమీర కుమార రత్న మే
నాగతిఁ దత్త్వముం దెలియు నాత్మ బలంబును స్థైర్య మీగదే॥ 105

సముద్రమును లంఘించునపుడు సింహికయను రక్కసి తనను మ్రింగగా, దాని ఉదరమును చీల్చుకొని వెలుపలికి వచ్చిన హనుమంతుడు లంకలో వేగుగా ప్రవేశించి అనేక సౌధములను, మణులు పొదిగిన గృహములను వెదకి వెదకి, అతి ప్రయాసమున, ఓపికతో తుదకు అశోక వనమున, మహాయోగిని యగు సీతను చూడగల్గెను. అట్లే తత్త్వమును తెలిసికొనుటందు నాకు అవ్యయమైన ఆత్మబలమును, సడలని చిత్తస్థైర్యమును ప్రసాదింపుము.

చం॥ భవమను సాగరంబునఁ గృపారహితాత్మక చిత్తవృత్తి, తాఁ
గవిసె దయాంతరంగమును, గానఁగరాని వివేక మెచ్చటో
నవయుచు నుండె, నేకడ వినాశము గూరుచు దుష్ట శక్తులే
భువి నను జుట్టుముట్టె నెటు వోదు? భవత్కృపలేక శ్రీకరా! 106

సంసార సాగరములో నిర్దయాత్మక చిత్తవృత్తి (సింహికవలె)

దయాభావమును క్రమింగివై చెను. వివేకము తెలియబడక ఎచటో నవయు చుండెను. ఎటుచూచినను విధ్వంసక శక్తులే విజృంభించినవి. శుభమును కలిగించువాడా! ఈస్థితిలో నీ దయలేక నేనెటు పోగలను ?

చం॥ ముద్రిక నిచ్చి భూమిజకు మోదము గూరిచి, రాక్షసాళి వి
చ్ఛిద్రము చేసి, లంకకును జిచ్చిడి వచ్చిన మారుతి క్రియన్,
భద్రముగూర్చు సద్గురునిఁ బంపు, మతండును వచ్చి, నేఁడు చి
న్ముద్రను దెల్పి, నా హృదయమోహము గూల్చి, యఘంబుఁ
గాల్చెడిన్॥ 107

నీ వొసగిన ఉంగరమును సీత కిచ్చి ఆమె కానందమును చేకూర్చి అడ్డువచ్చిన రాక్షసుల చంపి, లంకానగరమునకు చిచ్చుపెట్టి వచ్చిన మారుతి వలె రక్షణమును శుభమును గూర్చు సద్గురుని పంపుము. అతడు వచ్చి, నేడు నాకు చిన్ముద్రను తెలిపి, నా హృదయమందలి వ్యామోహమును నశింపజేసి, నా పాపములను కాల్చివేయునుగాక !

మ॥ పవమానాత్మజుఁ డేగుదెంచి, దొలుతన్ వైదేహి దర్శింప, నా
యవనీజాత శిరోవిభూషణము నీకై పంపుటల్ మున్నుగాఁ
బ్రవణుండై వచియించి, నీ కిడడె తద్రత్నంబు; నే నీయెడన్
భవ నాశార్థము త్వత్పదద్వయి దెసన్ భక్తి న్నివేదించెదన్॥ 108

పవన తనయుడు తిరిగివచ్చి, తొలుత తాను వైదేహిని దర్శించితి నని సవిస్తరముగా తెల్పి, జానకి పంపిన శిరోమణిని భక్తి ప్రపత్తులతో నీ కర్పించినట్లే, నే నిపుడు పుట్టుక తొలగుటకై నీ పాదములకడ నా భక్తి అనెడి మణిని నిల్పి ప్రార్థింతును. దయజూడుము.

చం॥ సతి దురవస్థఁ దెల్పి, మది స్వస్థత దప్పినదంట నీకు, హృ
త్పతివి సమస్త జీవులకు, స్వాత్మ వికాసము గోలుపోయి యీ
గతి బ్రతుకున్ వెలార్చు నను గాంచవొ ? కాంచియు నూరకుందువో
శ్రుతి దవులంగ లేదనుచుఁ, జూడు మిఁకైన సహానుభూతితో॥ 109

నీ సతియొక్క దురవస్థను తెలుపగా నీ మనసు తన స్వాస్థ్యమును కోలుపోయినదట. అట్లే నీవు జీవులందరికి హృత్పతివికదా! ఆత్మవికాసము పోగొట్టుకొని, ఈవిధముగా బ్రతుకు నీడ్చుచున్న నన్ను చూడలేదా? చూచియు నీ చెవి కంపలేదని ఊరకొంటివా? ప్రభూ! ఇకనైనను నన్ను సహానుభూతితో అవలోకింపుము.

ఉ॥ సాగర లంఘనం, బవనిజా పరివీక్షణ, ముగ్ర దానవో
ద్యోగ నిరాసనంబు, పురుషోత్తమ దర్శన సుందరంబుగా
సాగిన వాయుపుత్ర జయ సాధన మర్మము దెల్పు; దుర్వ్యథా
భాగము వోవ, నా బ్రతుకు భాసిలు సుందరకాండమై యికన్॥110

సముద్రమును లఘించుట, సీతను కనుగొనుట, భయంకరులగు దానవుల యత్నములు వమ్ము చేయుట, పురుషోత్తముడవగు నిన్ను మరల దర్శించుటలతో సుందరముగ సాగిన, వాయునందనుని విజయసాధన రహస్యమును తెల్పుము. దానిని తెలిసికొని నేనును మారుతివలె విజృంభించి, భవసాగరము దాటగలను, అవరోధముగ నున్న పాపపు భావముల చీల్చివైచి, సత్యము నన్వేషించి, తుదకు అశోక వనమున సౌందర్యరాశియగు నీ ప్రకృతిని దర్శింపగలను. అనంతరము నిన్ను దర్శించిఆనందింపగలను. ఇట్లు నా జీవితముకూడ దుర్వ్యథా భాగము పోగా ఒక అపూర్వమయిన సుందరకాండ మగును.

హనుమంతుని విజయసాధనమర్మము, అచంచలమగు శ్రీరామ భక్తియే. కనుక అట్టి భక్తినిమ్మని ఆకాంక్ష. సుందరకాండ పారాయణమున సకల బాధా నివృత్తియగుట విశ్వాసము.

సుందరకాండమున హనుమంతుడే నాయకుడు. ఆయన సహజ సుందరుడు. కాంచన వర్ణము కలిగి మిగుల బలిష్ఠములయిన అవయవములుగల ఆయన శరీరము సుందరము. పరమేశ్వర విభూతిని గుర్తించిన ఆత్మ సుందరము. నవ వ్యాకరణ యుక్తమగు భాషాధికారము సుందరము. బ్రహ్మచర్యాకృష్టమయిన నైతికనిష్ఠ సుందరము. అనన్య

సామాన్యమైన పరాక్రమము సుందరము. సేవానిరతి సుందరము. ఆయన దర్శించిన అశోకవనము సుందరము. అశోకవనమున నుండిన సీతామహాసుందరి సుందరము. కనుకనే ఆయన ప్రాముఖ్యము వహించిన రామాయణ భాగము సుందర కాండ మైనది.

ఉ॥ వానర సేనతో వెడలి, వార్నిధిఁ జేరి, తరించు మార్గమున్
గానక, దర్భశాయివయి కార్యము తీరు నుపాయ మెంచుచో,
దానవ వంశ ఖండనము దల్పఁ డహంకృతి రావణుండు; నా
మానసముం బ్రతీప గుణ మత్తత నిల్వలపోయు దక్కఁటా! 111

వానర సేనతో బయలుదేరి, సాగరము చేరి, దానిని తరించు మార్గము నాలోచించుచు, నీవు దర్భశయనుడవై యుండ, అహంకారముతో రావణుడు రాక్షస వంశమునకు కలుగనున్న ఉపద్రవమునుగూర్చి ఊహింపనే లేదు. అయ్యో! అట్లే నా మనసుకూడ వ్యతిరేకగుణములచే మదించి నిన్ను తలచుట లేదు.

చం॥ శరణు జగత్ప్రభూ! శరణు. శాత్రవ వర్గ నిపీడితుండనై
పరిభవమంది వచ్చితి భవత్పద సన్నిధి కార్తిదోఁప, న
న్గరుణమెయిన్ విభీషణునిగాఁ గను; నీకును దుర్నిరోధమై
పరగు భవచ్ఛరంబునకుఁ భక్తిఁ బ్రణామముచేసి వేడెదన్॥ 112

జగములకధినాథుడవైన రామా! నిన్ను శరణు వేడుచున్నాను శత్రువులచే (అంతః శత్రువులు-బాహ్యశత్రువులు కూడ) బాధింపబడి, అవమానింపబడి, ఆర్తితో నీ సన్నిధికి వచ్చితిని. దయతో నన్ను విభీషణుని వలె చూడుము. నీకును ఎదురులేని నీబాణమునకును మ్రొక్కి వేడుకొందును.

ఉ॥ పూనిన దుష్టశిక్షణము పూర్ణముసేయ సగౌరవంబుగా
నానతిఁగోర, సాగరుఁ డహంకృతిఁ జూపియుఁ గ్రోధమూర్తివై
బాణములేయ నీ యెదుటఁ బ్రాంజలియౌట స్మరించి, మున్నె నే
నానతమస్తకంబునఁ గృతాంజలినై శరణంబు వేడెదన్॥ 113

ఓ ప్రభూ! దీక్షవహించిన దుష్టశిక్షణము పూర్తిసేయుటకు నీవు సగౌరవముగ అనుజ్ఞ వేడగా, సాగరు డహంకారము వహించెను. పిమ్మట నీవు కోపించి బాణములేయ భయముతో నీ యెదుట అంజలిపట్టి నిల్చెను. ఈ విషయమును తలచి, ముందుగనే నా అహమును విడిచి, తలవంచి, దోసిలొగ్గి, నీ రక్షణము వేడుచున్నాను.

ఉ॥ వారధిఁ గట్టి సాగరముపైఁ గపిసేన సువర్ణలంకకుం
జేర్చినట్టి నీ ప్రతిభఁ జింతనచేసి వచింతు, నిప్డు సం
సార మహార్ణవంబుపయి చక్కని సేతువు గట్టి న న్నిఁకం
జేరుప మీవ, ముక్తిమణిసీమకు నేరుపునన్ రఘూత్తమా! 114

సముద్రముపై వారధి నిర్మించి నిలుకడలేని కోతుల సేనను సువర్ణలంకకు చేర్చిన నీ ప్రతిభను తలచి వేడుకొనుచున్నాను. సంసారమను మహాసాగరముపై చక్కని సేతువును నిర్మించి, చంచల మనస్కుడనైన నన్ను ముక్తియనెడి మణిద్వీపమునకు చేర్చుము.

ఉ॥ నీ రణ దుందుభిస్వనము నిర్మల చిత్తుని వాక్కు వోలె గం
భీరము తీక్ష్ణ ముజ్జ్వల మభీతిదమౌచుఁ బ్రతిధ్వనింపగాఁ
జేరెను బంక్తికంధరుని సేనలు మృత్యువు ప్రేరణంబునం;
జేరితి నేను నీ చరణసీమ వివేక నియోజనంబునన్॥ 115

నిర్మలమగు మనస్సు కలవాని పలుకువలె గంభీరముగను (ఆలోచనా స్ఫోరకముగను), తేజోవంతముగను, అభయప్రదముగను, నీ రణదుందుభి ధ్వనింపగా, మృత్యువు ప్రేరణమున దనుజ సేనలు రావణుని జేరినవి. వివేకము నియోగింపగా నేను నీ పాదములచెంత చేరితిని. నా కభయమిచ్చి అమృతత్వము చూపుమని భావము.

ఉ॥ పాపము పండెఁ జూడుమని పల్కుటకో యన, దుర్నిమిత్తముల్
దోఁప దశాస్య శీర్షములఁ దోఁచు సురత్న కిరీటపాళి, తా
మేపు దొలంగి నేలఁబడె హేళి తనూజుని పాద సంహతిన్,
నీ పదములే శరణ్య మవనీవర! ప్రోవు మటన్న పోలికన్॥ 116

"నీ పాపము పండినది చూడు" మని పల్కుటకో యనునట్లు దుశ్శకునములు తోచి, రావణుని పది తలల మీద ప్రకాశించు రత్నములు పొదిపిన కిరీటములు, తమ ఔజ్వల్యము నశింపగా, సుగ్రీవుని పాదముల తాకున "రామా! నీపాదములే గతి ప్రోవు" మన్నట్లు నేల పడినవి.

యుద్ధమునకు పూర్వము రావణుడు తన అంతఃపురమున మంతనము చేయుచుండ, సువేల పర్వతమునుండి చూచిన సుగ్రీవుడు ఆవేశముతో లంఘించి, రావణుని మందిరముచేరి, ఆతని తలలను తన్నగా వాని కిరీటములు నేల పడినవి. అనంతరము జరిగిన పోరాటములో సుగ్రీవుడు తప్పించుకొని మరల రాముని చేరెను.

చం॥ హితము వచింప నంగదు సహింపక, సంగరమున్ వరించు దు
ర్గతుని దశాస్యు లోకహిత కాముండవై వధియించినట్టు, ల
ప్రతిహతమౌచు నాయెద భరంబుగ నిల్చిన కామదానవున్
హతమొనరించి ప్రోవు నను నాత్మహితైకగతిప్రసంగతిన్॥ 117

మంచి చెప్పిన వాలిసూనుడగు అంగదుని కాదని యుద్ధమునే వరించిన దుర్గతుడగు రావణుని లోకములకు మేలుచేయతలచి వధించినట్లు, అడ్డులేక నా హృదయమున బరువుగా నిల్చిన రాగమను రాక్షసుని చంపి, ఆత్మహితమగు మార్గమున నన్ను సంరక్షింపుము.

ఉ॥ సాధన యింద్రజిత్తువలె శాంబరియై నను మోసగించి పోం,
గ్రోధము కుంభకర్ణుండయి గూల్చె మదీయ వివేకమున్, మహా
బాధను గూర్చె రావణ నిభంబగు కామము; రామచంద్ర! నా
వేదన మాన్ప రక్కసుల వే హరియించి శుభంబు గూర్పవే॥ 118

నేను చేయు సాధన (సాధనచతుష్టయము) కనుపించియు కనుపింపక దృఢముగా నిలువక ఇంద్రజిత్తువలె నన్ను మోసగించినది. క్రోధము కుంభకర్ణుడు కపిసేననువలె, నా వివేకమును హరించినది. కోరిక రావణుని పగిది గొప్ప బాధను గూర్చినది. ఓ రామచంద్రా! ఈ దానవుల గూల్చి, నా వేదన మాన్పి, శుభమును గూర్పుము. సాధన

యందు భ్రష్టుడనై వివేకము కోలుపోయి మలిల కోరికలతో బాధపడు నన్ను బ్రోవుమని ప్రార్థించుచున్నాను.

నిత్యానిత్య వస్తువిచారము, ఇహాముత్ర ఫలభోగ విరామము, శమాది షట్క సంపత్తి, ముముక్షత్వము - అనునవి సాధన చతుష్టయము. ఇందు "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నా పరః" అని తెలియుట మొదటిది. ఐహిక ఆముష్మిక భోగములను కోరకుండుట రెండవది. శమము (మనోనిగ్రహము), దమము (ఇంద్రియనిగ్రహము), శ్రద్ధ (గురువాక్య వేద శాస్త్రములందు నమ్మకము) సమాధానము (బుద్ధిని బ్రహ్మమునందు నిల్పుట), ఉపరతి (ప్రపంచానుభవమును వదలి బ్రహ్మమునందే ఆనందించుట) తితిక్ష (ద్వంద్వముల సహించుట) అనునవి మూడవది. మోక్షమునందు కోరిక కలిగియుండుట నాల్గవది.

చం॥ దురమునఁ, గుంభకర్ణు నతిదుర్మతిఁ గ్రూరు మహాశనుం గృపా
విరహితు, సుప్తిలోలు నవివేకి వధించి, జగాలఁ బ్రోవవో;
కరుణ, నవిద్య నిద్దురగఁ, గర్మఫలం బశనంబుగా, సదా
పరగుచు లౌకికంబుల, భవంబులఁ దేలెడ నన్ను గావవే॥ 119

మిక్కిలి దుష్టబుద్ధియు, క్రూరుడు, భోజనప్రియుడు, నిర్దయుడు, నిద్రాసక్తుడు, వివేకహీనుడు, అగు కుంభకర్ణుని సంహరించి, లోకముల బ్రోచినట్లు-రజోగుణావిష్కృతమైన ఘోర ప్రవృత్తి బుద్ధిగను, అజ్ఞానమే నిద్దురగను, కర్మఫలమే భోజనముగను, తమోగుణ ప్రయుక్తమగు మూఢవృత్తితో లౌకికములలో నిరంతరము ప్రవర్తించుచు, జన్మపరంపరలలో తేలెడి నన్ను దయతో కాపాడుము.

ఈశ్వరునితో జీవైక్యము (రామునితో సీతా సమాగమము) కలుగకుండ రాగ ద్వేషములు (రావణ కుంభకర్ణులు) అడ్డుపడగా, అందు ద్వేషమును గూల్చితివి. ఇక రాగమును నశింపజేయుట కర్తవ్యమని ధ్వని. జీవు డీశ్వరుని చేరకుండ, అజ్ఞానము (అతినిద్ర) కర్మఫలభుక్తి (మహాశనము) ఘోరప్రవృత్తి, జడత్వము అనునవి అతనికి బహుజన్మముల గూర్చి వానిని పరమాత్మనుండి దూరము చేయును.

మ॥ ఘను, నా రావణి, శాంబరీ సహిత సంగ్రామమున్, మహావీరునిం,
దునుమన్ లక్ష్మణుఁ, డా దశాననుడు దోడ్తో నేల వ్రాలెన్, నిజా
ననముల్ మోహవశంబునం గలఁగ, దీనత్వంబుతో; కాని నా
మనమున్‌రాగముదైన్యముం దొలఁగ నాత్మజ్ఞానమున్నింపుమా॥ 120

మాయాయుద్ధ విశారదుడు మహావీరుడు రావణపుత్రుడగు ఇంద్రజిత్తును, నిరంతరము జాగరూకుడైన లక్ష్మణుడు వధింపగా, ఆవార్త విన్న రావణుడు వ్యామోహబద్ధుడగుటచే నేలవ్రాలి కలత జెందెను. కాని నా మనమున రాగము లేక వస్తువులయెడ మమకారము, (interest in objects) హృదయ దౌర్బల్యము తొలగునట్లు ఆత్మజ్ఞానమును ప్రసాదింపుము.

చం॥ తలలను జేతులం దునుమఁ దక్షణ మయ్యవి యద్భుతంబుగా
మొలచిన కారణం బరసి, ముందుగ నాతని నాభిదేశము
న్గలభముతోడఁ జీల్చి దశకంధరుఁ గూల్చినయట్లు, స్వీయమై
బలకొను నాదు కర్మఫలభాండము గొట్టి, భవంబుఁ ద్రుంపవే॥ 121

యుద్ధమున రావణుని చేతులను నీ వెన్నిమార్లు ఖండించినను వెంటనే అవి యథాప్రకారము మొలచుచుండగా, దానికి కారణము ఆతని నాభియందున్న అమృత బిందువని తెలిసి, తొలుత ఆ నాభిదేశమును చీల్చి, వధించినట్లు, సొంతమై బలకొను నాకర్మఫల భాండమును భిన్నము చేసి, పునర్జన్మ లేకుండ చేయుము.

జన్మరాహిత్యమునకు బహు పర్యాయములు, బహు యత్నములు చేసినను, కర్మఫలములు మఱల పొడసూపుచు, అనేక జన్మములకు బీజములగుచున్నవి. అవి నశించిననే జన్మములు నశించును. ముందుగా ఆ కర్మఫలముల నశింపజేయుమని ప్రార్థన.

శా॥ బ్రహ్మానందముగల్గ జీవులకు, దుర్భావుల్ నిశాటుల్ వడన్,
బ్రహ్మాస్త్రంబున రావణుం దునుమవో? ప్రాగ్జన్మసంస్కారమై
బ్రహ్మజ్ఞానము గూర్చు జీవులకు సంప్రాప్తించు నజ్ఞానమున్;
బ్రహ్మప్రాప్తి నొసంగు మార్గమగుటం బ్రార్థింతు నద్దానికై॥ 122

జీవులకు గొప్ప సంతోషము కలుగగా, దుస్స్వభావులైన రాక్షసుల గూల్చి, బ్రహ్మాస్త్రముతో రావణుని హతమార్చితివి. (బ్రహ్మజ్ఞానము వలననే కోరిక నశించుననుట.) జీవులకు కలుగు అజ్ఞానమును పూర్వ జన్మల సంస్కార ఫలమైన బ్రహ్మజ్ఞాన మొక్కటే నశింప చేయును. బ్రహ్మప్రాప్తికి, అది మార్గమగుటచే అట్టి బ్రహ్మజ్ఞానము నిమ్మని నిన్ను ప్రార్థించుచున్నాను.

జ్ఞానమనగా స్వస్వరూపస్థితి. బ్రహ్మానందము ఒకటిపై ఇరువది సున్నల సంఖ్యగల మనుష్యానందములని (100000000,000,00,00,00,000) వేదములలో (తైత్తిరీయ-బ్రహ్మవల్లి) ఒక కొలత కలదు. సులభగ్రాహ్య మగుటకు, దానినే మరొక విధముగా చెప్పవచ్చును. ఎల్లపుడు అద్వైత మయిన ఆత్మను దర్శించుట సమాధి. అట్టి సమాధిలో అనుభవింపబడు స్వస్వరూపానందమే బ్రహ్మానందము. ఇది అన్ని ఆనందములకంటె మిన్నయైనది. బ్రహ్మజ్ఞానము అనేక జన్మల పుణ్యఫలమని తెలియ వలెను.

మ॥ మది కాఠిన్యముఁ బూని మానవత నొంపఁ జూడ, రారమ్ము నా
హృదిలో మూసిన తల్పులం దెఱచి సంప్రీతిం బ్రవేశింపఁగాఁ
గదనంబందు దశాననుం దునిమి లంకా ద్వారదేశంబునం
బదముల్ మోపి విభీషణుం బతి నొనర్పం జేరు తద్వైఖరిన్॥ 123

యుద్ధమున రావణుని చంపి, విభీషణుని రాజుని చేయుటకై, లంకానగర ద్వారముకడ నీ పాదములు మోపినట్లు, మనస్సు కఠినమై మానవత్వమును బాధింప పూనికొనగా, నా హృదయములో మూసిన తలుపుల తెఱచుకొని ప్రవేశింపుము.

పదునాలుగేండ్లు అరణ్యవాసము విధింపబడుటచే విభీషణుని పట్టాభి షేక సమయమున, నీవు నగరములో ప్రవేశింపక లక్ష్మణుని పంపితివి. ఇపు డారణ్యవాసము ముగిసినది. కనుక ద్వారదేశముకడనే నిలువక, నా హృదయకవాటముల తెఱచుకొని అయోధ్యలో ప్రవేశించునట్లు, లోనికి రమ్ము. ఏలననగా హృదయమే నీ నివాసము కదా: "అన్త శ్చరతి

భూతేషు గుహాయాం విశ్వమూ_ర్తిషు"–శ్రుతి.

మ॥ బలవద్దానవులన్ వధించి, కరుణా వారాశివై మించి, యా
వల లంకాధిపుగా విభీషణుని నిల్పన్ లేదె, నేఁడట్టులే
యెలమిన్ మూఢ మనఃప్రవృత్తి దొలఁగన్, హృద్భూమి జ్ఞానప్రభ
న్నిలుపన్‌రాగదెమేలుకాంతుఁనిక నే నీనామ సంకీర్తనన్॥ 124

బలవంతులయిన రాక్షసుల వధించి, దయాసముద్రుడవై మించి, విభీషణుని లంకాధీశుని గావించినట్లు, నేడు నా మనసునగల మూఢప్రవృత్తి తొలగగా హృదయభూమియందు జ్ఞానకాంతిని ప్రతిష్ఠించుటకు రమ్ము. ఇక నేను నీ నామ సంకీర్తనము వలన మేల్కొనెదను.

బలవత్తరమైన ఇంద్రియ గ్రామము జయింపబడినపుడే సుబుద్ధికి పట్టాభిషేకమగునని ధ్వని.

ఉ॥ నీ విజయమ్ము రావణుని నిర్గమనమ్ము, స్వతంత్రతా ప్రతి
ష్ఠా విధ మెల్ల వే దెలుప, జానకి నిన్దరసింప వ్యగ్రయై
పావనిఁ గ్రమ్మరం బనుపు వైఖరి, యీశుడు జీవుఁ జేరఁగా,
జీవుఁడు నీశ్వరుం గదియఁ జేసెడి యత్నముగాఁ దలంచెదన్॥ 125

నీ విజయము, రావణవధ, స్వతంత్రతాప్రతిష్ఠ, మున్నగు విషయముల దెలుపుటకు, వెంటనే నీవు సీత యొద్దకు హనుమంతుని వంపగా జానకియును నిన్ను చూచుటకు వేగిరపడుచు, అతనిని నీకడకు వంపిన విధము–ఈశ్వరుడు జీవుని చేరుటకు, జీవు డీశ్వరునితో కలియుటకు, చేయు యత్నముగా భావించెదను.

శా॥ నీ వృత్తాంతము కుంభినీ దుహితకున్, నీ కామె సందేశమున్
భావంబున్ వివరించి, మీ యెడదలన్ భారంబుఁ బోఁజేసె నా
సేవాధర్మపరాయణుఁడగు కపిశ్రేష్ఠుండు; నాతండెపో
జీవాత్మైకృవిధాయి సద్గురుఁడు సంసేవింతుఁ దత్పాదముల్॥ 126

సేవాధర్మ పరాయణుడగు ఆంజనేయుడు నీ (పరమాత్మ) వృత్తాం

తమును భూజాతకును, ఆమె (జీవుని) సందేశమును భావమును నీకును, వివరించి, మీ హృదయములందలి భారమును తొలగించెను. ఆతడే జీవునికి ఆత్మకు ఐక్యము గూర్చు సద్గురుడు. ఆతని పాదముల సేవింతును.

కుంభినీ దుహిత శబ్దమువలన భూమిపై పుట్టిన జీవి అని ధ్వని. ఈశ్వర తత్త్వమును జీవునికి, జీవుని ఆర్తిని ప్రపత్తిని ఈశ్వరునికి, నివేదించి జీవేశ్వరైక్యము పొందించువాడే సద్గురుడు.

మ॥ సతి, సద్ధర్మవతిం, గృపా నిరతి, దుష్టానీక సంహర్త్రి, స
త్కృతిఁ, జిద్రూపవతిన్, భవత్ప్రియయ నిక్షేపాకృతిన్ సీతఁ దా
నతిభక్తిం దొలుతన్ విభీషణుఁడు నీకర్పించి, యానంద సం
తతి నొప్పారె; సుబుద్ధి యాత్మఁ బరమాత్మం జేర్చు
సామ్యంబునన్॥ 127

పతివ్రతయు, ధర్మము తప్పనిదియు, దుష్టసంహారమునకు హేతువైనదియు, మంచి శీలము గలదియు, చిత్ స్వరూపమైనదియు, నీ ప్రేమ నిక్షేపమో యనదగు ఆకృతి గలదియు, అగు సీతను మిక్కుటమగు భక్తి ప్రపత్తులతో నీకర్పించి, సుబుద్ధి ఆత్మను పరమాత్మతో అనుసంధానము చేసినట్లు, విభీషణు డానందించెను.

మ॥ నిను జేరం గడు వేగిరంబడుచు రా, నీ వగ్ని సంశుద్ధి కా
జ్ఞ నిడం జోద్యము; మైథిలీ హృదయ మజ్ఞాతంబె నీ; కైన జీ
వుని శోధించి తపింపఁజేసెడి స్వభావున్ నిన్ను నేమందు ? నీ
ఘనకార్యంబునఁ దప్తకాంచనమునాఁ గన్పించె భూజాతయున్॥ 128

నిన్ను చేరుటకు మిక్కిలి తొందరపడుచు రాగా, అగ్నియందు తన పవిత్రతను నిరూపింపుమని నీ వామెను కోరుట మిక్కిలి వింతగానున్నది. సీత హృదయము నీకు తెలియదా ? ఐనను జీవుని బాధించి శోధించు స్వభావముగల నిన్నేమనగలను ? ఈ నీ ఘనకార్యమువలన పుటము పెట్టిన బంగారమువలె సీతాదేవి మిక్కిలి ప్రకాశించినది.

భూజాతయగు సీత భూమినుండి త్రవ్వితీయబడిన బంగారమే. సహజ ప్రకాశముగల ఈ బంగారము పుటముపెట్టబడి మిక్కిలి ప్రకాశించినది.

ఉ॥ నీవు జగత్త్రయీ విభవ నేతవు, దైవతకోటిఁ బ్రోవగా
రావణముఖ్య రాక్షస విరామము గూర్చిన మాధవుండవే,
నీ విభవంబుఁ బేర్కొనఁగ నేర మటంచు సుపర్వులెంచ నేఁ
గేవల మానవుండ, నెటు గీరితిసేయుదు నీ మహత్త్వమున్ ? 129

నీవు మూడు లోకముల విభవమునకు అధికారివి. దేవతల సమూహముల రక్షించుటకు, రావణాది రాక్షసుల హరించిన లక్ష్మీమనోహరుడవే. నీ వైభవమును పలుక జాలము అని దేవతలే నుతింప, కేవలము మానవుడనైన నేను నీ గొప్పతనము నెట్లు సంకీర్తింపగలను ?

చం॥ పదుగురు చూడ, సీతఁ గొనివచ్చి హుతాశనుఁ డప్పగింప, నిం
పొదవఁ బరిగ్రహించి యెదనుంచి సుదీర్ఘ వియోగ తాపముల్
సెదర, గతస్మృతుల్ గదుర, శ్రీయుతుఁడైతివి; స్వామి! నేఁడు నా
మది పరితాపవహ్నిఁ బడె, మానక దాని సమాదరింపవే॥

అనేకులు చూచుచుండ అగ్నిదేవుడు సీతను తీసికొనివచ్చి నీకప్పగింపగా, ప్రేమతో ఆమెను స్వీకరించి దీర్ఘకాలపు వియోగమువలన కలిగిన బాధ తొలగునట్లు, నీ హృదయమున నిల్పుకొని పూర్వపు జ్ఞాపకములను పొంది, శ్రీతోకూడిన వాడవైతివి. నేడు నా మనసుకూడ పశ్చాత్తాపమనెడి అగ్నిలో పడినది. విడువక దానిని చక్కగా ఆదరింపుము.

శ్రీ అనగా లక్ష్మి, సంపద, ఐశ్వర్యము, శోభ, కీర్తి-ఇంకా ఎన్నో అర్థములు. సీత రామునితో చేరగనే రాముడు నిజముగ లక్ష్మీపతి అయినాడు. అష్టకష్టములలో నొకటగు భార్యావియోగము పోయి ఆయనకు సత్సంపద కలిగినది. ఐశ్వర్యములకు ఐశ్వర్యమయిన మనశ్శాంతి లభించినది. విచారము తొలగి మాత్నశోభ తోచినది. అన్నిటికంటె మిన్నయై ఆయన కీర్తి మూడు లోకముల వ్యాపించినది.

చం॥ జననియు జన్మభూమియును స్వర్గము కన్నను మిన్న యంచు నీ
వనుట యదార్థ; మాత్మకృతమైన జగమ్మున వాంఛనీయ మా
జనని పరాంబికం గనుట, సత్యము నిత్యము నైన బ్రహ్మమం
దనితరమై రహించుటయు; యంతకు మిన్నగు సౌఖ్య మున్నదే? 131

తల్లి, తల్లిభూమి, స్వర్గముకంటె గొప్పవని నీవనుట సత్యమే. అవి తత్త్వమును దర్శింపజేయుటే. ఆత్మనుండి పుట్టిన ఈజగత్తున కోర దగినవి సృష్టికి మూలమైన నీ ప్రకృతిని దర్శించుట, జగముల కాధార మైన నీయందు (బ్రహ్మమందు) ఒకటై పోయి ఆనందించుటేకదా! అంత కంటె గొప్పదగు సుఖమేమున్నది ? లేదని భావము.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అని రాముడు పల్కి నట్లొక శ్లోకము ప్రచారమున కలదు. అది సత్యమైనను కాకున్నను, దానిహృదయము మాత్రము కేవలము లౌకికము కాదు. జనని అనగా మూలప్రకృతి, ఆమె సర్వసృష్టికి కారణము కనుక. జన్మభూమి బ్రహ్మమే. బ్రహ్మపదార్థమే సృష్టికంతకు ఆధారము. దానినుండియే జగత్సమూ హము లేర్పడినవి. స్వర్గసుఖములు కేవలము ఒక లోకమునకే పరిమితము లగుటచే, ఆలోకముతోపాటు అవియు నశించునవే. కనుక శాశ్వతమైన ఆత్మయందేకమై. ఆత్మకంటె భిన్నముకాని మహాప్రకృతిని (అభిన్న శక్తిని) చూచుచు, యోగు లానందింతురు. ప్రతి ప్రాణియొక్క ఆకాంక్ష కూడ అదేకదా!

శా॥ పౌలస్త్యుం ద్రిజగద్భయంకరు వరప్రాబల్యుఁ గామాంధు దు
ష్టాలంబున్ సమయించి లోకమున శీలౌన్నత్యము న్జూపు, ని
న్నేలీలన్ విడనేర్తుఁ, బుష్పకమునం దీమూలఁ జోటిచ్చినం
జాలున్, నీ వెనువెంట వత్తు, వలదీ సంసార సౌభాగ్యముల్॥ 132

పౌలస్త్యుని వంశమున బుట్టి వరప్రాబల్యమున ముల్లోకములకు భయమును గలిగించి, కామాంధుడై, దుష్టులకు ఆశ్రయుడైన రావణుని చంపి, ప్రపంచమున శీలౌన్నత్యము నిరూపించిన నిన్నెట్లు విడువగలను? నీవు ప్రయాణించు పుష్పక విమానమున ఈ మూల చోటిచ్చిన చాలును.

నేను నీవెంట వత్తును. ఈ సంసార సౌభాగ్యములు నాకు వలదు.

చం॥ భరతుఁడు మంత్రులుం బ్రజలు భక్త్యనురక్తుల హర్షబాష్పముల్
దొరల, భవత్పదంబులను దోయిలులన్ ఘటియించి కొల్చిరా,
నరయ వశిష్ఠమౌనికిని నమ్మలకుం బ్రణమిల్లి రాజవై,
పరిజన సేవితుండవయి, పాలనసేయ నయోధ్య కేగవో॥ 133

నందిగ్రామమున భరతుడు మంత్రులు ప్రజలు భక్తితో అను రక్తితో ఆనందబాష్పములు రాలుచుండగా, నీ పాదములకడ అంజలులు పట్టి ప్రపత్తిని తెలుపుచు నీ వెంటరాగా, వశిష్ఠమౌనికిని ముప్వురు తల్లులకు నమస్కరించి, రాజఠీవితో పరిజనయుతుడవై అయోధ్య కేగలేదా ?

చం॥ పరిజనమౌను బ్రాణము, లుపాధి భవత్సువిశాలరాజ్యమౌ,
నిరుపమమౌ తనుత్రయము నీవు వసింపఁ బ్రతిశ్రయంబులౌఁ,
బరగును బీఠమై మనము, భాసిలు బుద్ధి యమాత్యవర్యుఁడై,
పరమమునీంద్రవంద్య! పరిపాలనసేయుచు వచ్చిభృత్యునిన్॥ 134

పరమేశ్వరా! శ్రేష్ఠులగు మునులచే నమస్కరింపబడువాడా! నీకు నా ప్రాణములు పరివారమగును; జీవోపాధి విశాలమగు రాజ్యమగును; పోలికలేని స్థూల సూక్ష్మ కారణ దేహములు మూడును నీవు వసించుటకు, కొలువిచ్చుటకు, సౌధములగును; మనస్సు సింహాసనమే యగును; బుద్ధి అమాత్యశేఖరుడగును. కనుక విచ్చేసి దాసుడనగు నన్ను పాలింపుము.

ఉ॥ పావులఁ దెచ్చి నీ చరణ పంకజ సన్నిధి నిల్పి మ్రొక్కి, స
ద్భావము దోఁప, భూప! పరిపాలన మోపఁగలేని భారమై
యేఁతను గూర్చెఁ దాల్పు మనియెన్ భరతుండు; ప్రధానులెల్ల త
ద్భావ మెఱింగి పల్కిరి యథార్థమటంచు జనుల్ నుతింపఁగా॥ 135

నీ పాదుకలను తెచ్చి నీ పాదపద్మముల చెంత నుంచి, నమస్క రించి, సద్భావముతో "ఓరాజా! ఇంతకాలము పరిపాలన మోపలేని

బరువై విరక్తిని గూర్చినది. వీని నిక ధరింపుమని భరతుడు పలుకగా, ప్రధానులందఱు వాని భావమును గుర్తించి "ఇది సత్య" మని పల్కిరి. ప్రజలు నుతించిరి.

వాస్తవమునకు రాముని ప్రతినిధిగా భరతుడు తన చేతనైనట్లు రాజ్యమును చక్కదిద్ది, బొక్కసమును పెంచి, సమర్థతతో పాలించినను, రాజనీతిజ్ఞుడు వినయశీలుడు కనుక ప్రభువైన రాముని రాజ్యము స్వీకరింపుమనుటకు భరతుడట్లు పలికెను.

శా॥ నాచే నైనటు నిర్వహించితిఁ బ్రభూ! నావంతు కర్తవ్యమున్
నీ చిద్రూప జగంబునం దొకఁడుగా, నీ యాజ్ఞమై నిల్చి; నే
డాచార ప్రతిపాలనంబు భరమై యాయాసము న్గూర్చెఁ; ద్వ
త్ప్రాచుర్యమ్మున నాకు ముక్తి నిడి నీ రాజ్యమ్ము చేకొమ్మిఁకన్॥ 136

ఓ ప్రభూ! నీ మాయాకల్పితమయిన లోకమున ఒక వ్యక్తిగా, నీ యాజ్ఞకు కట్టుబడి, నా శక్తి కొలది నావంతు కర్తవ్యము నిర్వహించితిని. అట్టి వర్తనము (ఆచారాదుల పాటించుట) భారమై అలసట కల్గించుచున్నది. నీ అతిశయమును ప్రదర్శించి, రాజ్యపాలన కర్తృత్వమును నీవే వహించి, నాకు విముక్తి నిమ్ము.

కర్తృత్వమును భగవానుని కర్పించినపుడు, కర్మజములయిన బంధములు జీవుని కట్టివేయ జాలవుకదా!

చం॥ బహువిధ తూర్య నాదములు, వంది జనాదుల స్తోత్ర పాఠముల్,
బహుకృత వేద ఘోషములు, పల్కులు, దీవెనలున్ ధ్వనింపఁగా,
బహుజన మౌని వానర సువర్వ సురాహిత ముఖ్యులెల్ల ధూ
ర్వహులయి, భద్రపీఠమునఁ బట్టముగట్టిన నిన్నె గొల్చెదన్॥ 137

అనేక విధములగు తూర్యనాదములు, వందిజనుల స్తోత్ర పాఠములు బహువిధములయిన వేదఘోషములు, పలుకులు, దీవెనలు ధ్వనింపగా మానవులు మౌనులు వానరులు దేవతలు రాక్షసముఖ్యులు కార్యనిర్వా

హకులుగా, నిన్ను సింహాసనమున కూర్చుండజేసి పట్టము గట్టిరి. ఇట్టి పట్టాభిరాముని నిన్నే కొల్చెదను.

శా॥ వామాంకంబున జానకీ రమణియుం బార్శ్వంబులన్ సోదరుల్
సౌమిత్ర్యాదులు ఛత్ర చామర యుతుల్ సంప్రీతి సేవింపగా,
భూమానందముతోడఁ ద్వచ్చరణముల్ మ్రొక్కంగ సామీరి, నా
స్వామిన్ నిన్నె యెడంద నిల్పుకొనెదం బట్టాభిరామాకృతిన్॥ 138

ఎడమవైపున జానకీదేవియు, పార్శ్వములందు లక్ష్మణుడున్నగు సోదరులు, రాజలాంఛనములగు ఛత్రమును, చామరములను పూని నిలువగా, మహానందముతో హనుమంతుడు నీ పాదములు మ్రొక్కగా, నా స్వామివగు నీ పట్టాభిరామాకృతిని హృదయమున నిల్పుకొందును.

లక్ష్మణుడు శేషుని అంశము కనుక ఛత్రమును, భరత శత్రుఘ్నులు శంఖ చక్రముల అంశములందు జనించుటచే చామరములను పూనుట సహజమే. ప్రపత్తి పూర్వక భక్త్యవధియగు హనుమానుడు పాదముల చెంత నిల్చుట సుందరతరము.

చం॥ జయ, జయరామ! సర్వజన సంస్తుతనామ! దయాభిరామ! ని
ర్జయ, ఘన పాప దానవ విరామ! గుణగ్రహసైకసీమ! ది
గ్జయ, పరిముక్త జీవ హితకామ! సుధామ! ముముక్షుధామ! పా
లయ, భవతాప సంహరణ లాలస మానస! చిద్ఘనోల్లసా! 139

జయరామా! జనులందరిచే కీర్తింపబడు నామము కలవాడా! దయచే మనోజ్ఞమయినవాడా! జయింపుము. గొప్ప పాపములనెడి రాక్షసుల సంహరించెడివాడా! గుణముల గ్రహించుటందు హద్దు అయినవాడా! గెలుపొందుము. పతితులయి విడువబడిన జీవుల క్షేమమును కోరువాడా! మంచి కాంతి కలవాడా! మోక్షము కోరువారికి నిలయమైనవాడా! దిక్కుల (సర్వత్ర) జయింపుము. భవతాపమును తొలగించుటందు సక్తమైన మనస్సు కలవాడా! ఘనీభూతమైన చైతన్యముయొక్క ఉల్లాసము కలవాడా! పాలింపుము.

శనగ గింజ పైన పప్పులను కప్పుచున్న త్వక్కు వలె, శివశక్తులను కప్పుచున్న పరాబిందువే (Massive Consciousness) సృష్టికి మూలము ఇదే చిద్ఘనము.

ఉ॥ వానర వీరులన్ విజయ వర్ధనులన్ నవభూషణాంబర
శ్రేణుల భోగ భాగ్యములఁ బ్రీతులఁజేసి, సగౌరవంబుగా
మానిత దివ్యతేజుఁడగు మారుతి కీ విడ రత్నహారమున్,
దాన నతండు నీదయిన దర్శనముం గనలేమి గ్రుంగడే॥ 140

విజయ వర్ధనులైన వానర వీరులను నూతన వస్త్రములచేతను, భూషణములచేతను, భోగ భాగ్యములచేతను, తృప్తులజేసి, గౌరవముతో గొప్ప తేజస్సుగల మారుతికి రత్నహారమును కానుకనీయగా, అతడా హారమందలి మణులలో నీ స్వరూపమును చూడజాలక క్రుంగిపోయెను.

ఉ॥ పావని భక్తి యట్టిదని ప్రాకృతుఁ డేమి యెఱుంగు? గుండెలో
నీవు వసింప రత్నముల నిర్గత మెట్లగు నీదు రూప? మో
దేవ! త్వదన్యమా మణులు దీర్చునె నీ కొలఁకైన తృష్ణ? సం
భావనసేతు నా యెడఁద భాసిలు మొక్క నిమేషమేనియున్॥ 141

వాయునందనుని భక్తి అట్టిదని సామాన్యుని కేమితెలియును? గుండెలో నీవు కొలువుండగా, హారరత్నములందు నీరూప మెట్లు కన్పించును? దేవా! నీగుఱించి తనివి తీరని కోరికను నీవు లేని మణులు తీర్చ గలవా? నిన్ను ధ్యానింతును. నా హృదయములో ఒక రెప్పపాటు కాల మైనను ప్రకాశింపుము.

## అవభృథము

చం॥ బ్రతుకున కర్థమేమి ? నిను ప్రార్థన సేయకయున్న, దుర్వ్యథా
పతితముగాక, కర్మఫల ఖాండముగాక, యనంత జన్మ దు
ష్కృత విభవంబుగాక, భవకీలిత మృత్యు ముఖంబుగాక, ఓ
పతితశరణ్య ! నా కరముఁబట్టి సముద్ధరణంబు సేయవే॥ 142

నిన్ను ప్రార్థనసేయకున్న బ్రదుకున కర్థము లేదు. ఆ బ్రతుకు కేవలము దుర్వ్యథలో (బాధలో) పతినదే యగును. కర్మఫలఖాండమే యగును. అంతములేని జన్మముల పాపప్రాబల్యమే యగును. పుట్టువు చేత అలంకరింపబడిన మృత్యుముఖమే యగును. పతితులకు ఆశ్రయమైనవాడా! నాచేయిపట్టి నన్నుద్ధరింపుము.

చం॥ తమవు ధనంబు మానసము ధర్మము కర్మము నీ కొసంగి, నా
దనియెడిదేమిలేక తుద కర్పణమైతిని నీకు; నీవ యీ
తనువున బంధితుండనయి దారి యెఱుంగకఁ గ్రుంగిపోవు న
న్ననయము చోదకుండవయి యాత్మపథంబున నిల్పవేడెదన్॥ 143

శరీరము, ధనము మనము ధర్మము కర్మము నీకిచ్చి, "నాది" అనునదేమియు లేక, తుదకు నీకే అర్పణమైతిని. నీవే యీ శరీరమున బంధింపబడి దారి తెలియక క్రుంగిపోవు నన్ను, ఆత్మమార్గమున నిల్పి, నిరంతరము నడిపింపుము.

ఉ॥ ఆడితి నాడితిన్ మఱల నాడితి భూమిక లెన్నొ దాల్చి, నే
వీడిన లోకరంగములు వేనకు వేలయి తోఁప, నందు నా
జాడల వీడి వచ్చితిని; చాలు, శ్రమంబున కోర్వఁ జాల; నం
జూడుము శాంతిసాగరముఁ జొచ్చెద బిందువనై యఖండమై। 144

అనేక పాత్రల (జన్మముల) ధరించి ఎంతగనో ఆడితిని. మఱల మఱల ఆడితిని. నేను వీడి వచ్చిన లోక రంగస్థలములు వేల సంఖ్యను మించినవి. అందు నాజాడల వీడి వచ్చితిని. చాలును. ఇక శ్రమకోర్వ

లేను. నన్ను దయజూడుము. శాంతి సాగరములో బిందువునై, అఖండమై పోదును.

శ్రీవిద్యలో బిందువు, దేవీస్థానము. అది అఖండము. బిందువనగా అఖండ పరమేశ్వర చైతన్యము, లేక శక్తియొక్క ఒకరూపము. ఇది ఈశ్వర తత్త్వాంతర్గతము. సృష్టికి సంసిద్ధమైన శక్తియొక్క ఘనావస్థయే బిందువు. శూన్యము(void) గుణము (తన్మాత్ర) అను నీరెండును బిందువు నందున్నవి. నిర్గుణ పరబ్రహ్మమును దెలుపునపుడు శూన్యము నకు, సృజనాత్మక బ్రహ్మరూపశక్తిని తెలుపునపుడు గుణమునకు, అది సంకేతము. ఈ బిందువునే కొందఱు పౌరాణికులు ప్రభుని (మహావిష్ణువు) గను, కొందఱు బ్రహ్మ పురుషునిగను చెప్పుదురు. శివశక్తుల కప్పు చున్నందున ఈ పరాబిందువే సృష్టికి మూలము.

శా|| నాలో నెన్ని యపశ్రుతుల్ వలికెనో? నాదైన విన్యాసమం
దే లోపంబులు గానవచ్చెనొ కదా యీలీల శిక్షింప; నన్
జాలిం జూపి సముద్ధరింపగదె; ఈ సంసార కూలంకషా
వ్యాలోల ప్లవముం బ్రతీరమును జేర్ప న్నీకె చెల్లుం బ్రభూ! 145

నన్నిట్లు శిక్షించుటకు నాలో ఎన్ని అపశ్రుతులు పల్కినవో? నా విన్యాసమం దెన్ని లోపములు కన్పించినవో? నాయెడ జాలిచూపి నన్ను సముద్ధరింపుము. ప్రభూ! సంసారమను మహాసాగరములో క్రిందుమీదగు చున్న నౌకను తీరము చేర్చుట నీకే చెల్లును.

నా కవితలో ఎన్ని అపశ్రుతులున్నవో? నా పద భావ విన్యాసములో ఎన్ని లోపములు దొర్లినవో! అన్నిటిని క్షమించి నన్ను దయజూడు మని ధ్వని.

శా|| నీవే నా హృది నిల్వ దుఃఖమున కున్నే యింక స్థానంబు? నే
నేవేళన్ భవదీయ రాగమయ దివ్యేశాన యోగంబునన్
భావానందమునందె లీనమగుదుం; బ్రాప్తానుభూతుండనై
భావింపన్ భవమైన మోక్షమయినం బ్రాణేశ! నిగ్నాడుటన్|| 146

నీవే నా హృదయములో నిల్చినచో, దుఃఖమునకు తావెక్కడ? నే నెల్లపుడు నీ ప్రేమమయమయిన దివ్యతేజస్సుతో కూడి, భావానంద మందే కలిసిపోదును. ఇట్లు పొందిన అనుభూతితో ప్రాణేశుడవైన నిన్ను కూడి, భవమయినను, మోక్షమయినను ఒకటిగనే భావింతును.

ఉ॥ కోరిక లప్డు దామముగఁ గూడును నీకయి, దుఃఖ బాష్పముల్
చేరును మంచి ము త్తెముల చేరులుగా భవదీయ మౌళిలోఁ,
దీరు సుఖాలు కష్టములు తిన్నని వన్నెల వస్త్రమౌచు, నిం
పార గ్రహింతు వీ యుపద, నంతము గల్గునె నీదు ప్రేమకున్॥ 147

అపుడు నా కోరికలన్నియు నీకొఱకు పుష్పదామముగును. నా దుఃఖ బాష్ప బిందువులు మంచిముత్యాల చేరులుగా, నీ కిరీటములో చేరును. నా కష్టములు సుఖములు నీకు రంగురంగుల వస్త్రములగును. నీవీ కాన్కను ప్రీతితో గ్రహింతువు. నీ ప్రేమ కంతముండదు.

శా॥ శ్రీదేవీయుతతావకద్యుతుల నా చిత్తంబు తాఁజీవమై
యాదేయంబుగ నిల్వ, జ్ఞానమయుమై యానందమై సత్యమై
బోధింపన్ దయసేయ వేడెదఁ బ్రభూ! పూర్ణత్వమందేకమై
పోదున్మాయనుదాఁటి, శాంతిగగనంబున్మించుఁజిత్కాంతినై ॥148

నా చిత్త మొక కమలమై శ్రీదేవితోకూడిన నీకాంతుల గ్రహింప తగినదై నిలువ, సత్య జ్ఞా నానందమయుడవగుచు నన్ను ప్రబోధింప దయసేయుమని ప్రార్థించెదను. ప్రభూ ఈ మాయను దాఁటి పూర్ణత్వ మందు కలిసి, శాంతి అనెడి ఆకాశమును మించు అనగా శాంత్యతీతమైన చిత్కాంతినై పోదును.

మాయాతీతమైన అచల రూపము పరిపూర్ణమని అతిప్రాచీనములగు చాందోగ్యా ద్యుపనిషత్తులు స్పష్టము చేయుచున్నవి. ఎట్లన – "ఏక మే వాద్వితీయం బ్రహ్మ", "ఆత్మా పురస్తాత్। ఆత్మా పశ్చాత్", "అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" "అంతః పూర్ణో బహిః పూర్ణః – ఇత్యాది.

ఉ॥ రామసుధాతరంగిణీ విరామము లేక స్రవించి మించ, నీ
భూమిని జ్ఞానసస్యపరిపోషణ గల్గుత! నింక మన్మనో
రామమునన్ వివేక మధురంబగు జీవన ధార లేచుతం,
గామ విమోహ పంకమది క్షాళితమై ఘటశుద్ధి గల్గుతన్॥ 149

శ్రీరామసుధాతరంగిణి ఆగిపోక ప్రవహించుచు అతిశయింపగా, ఈ భూమిపై జ్ఞానమనెడి పంటకు చక్కని పోషణ కల్గునుగాక! ఇక నా మనస్సనెడి వనముతో వివేకముచే తీయనైన నీటి (జీవన) ధారలు, పైకుబుకునుగాక! కోరిక వ్యామోహ మనెడి బురద కడుగబడినదగుటచే, ఘటశుద్ధి కల్గునుగాక!

ఉ॥ ఎందఱొ సత్కవుల్ ప్రతిభ యేర్పడఁ బల్కినఁ ద్వచ్చరిత్ర ని
ష్యంది రసానుభూతి, హృదయంబును దట్టి వినూత్న భావ సం
స్పందనఁ గూర్ప, వ్రాసితినిఁ బద్యములం గవిచక్రవర్తి! నీ
ముందు మదీయ గర్వము సమూలముగా నశియించె నీయెడన్। 150

సత్కవు లెందఱో తమ ప్రతిభను ప్రదర్శించి వ్రాసిన నీ చరిత్రము నుండి కల్గిన ఆనందానుభవము, నాహృదయమును తట్టి క్రొత్తదగు భావ స్పందన గూర్పగా, ఈ పద్యముల వ్రాసితిని. ఈ గర్వము అనగా నేను కవినన్న అహంభావము, నీ యెదుట నిలువ ఇపుడు సమూలముగా నశించినది.

శా॥ సర్వాధారుఁడవైన నీ చరితమున్ సర్వంబు వాక్రువ్వ నీ
యుర్విన్ నేర్చునెవండు? కాంక్షమెయి నన్నొక్కింత పల్కించి, త
త్సర్వంబున్ విన నిచ్చగించితొ? ప్రభూ! సర్వేశ్వరాఖ్యుండ, నీ
నిర్వాహంబు, నగస్త్యరాజ కులము న్దీపింపఁజేయం గదా? 151

సకలమునకు ఆధారుఁడవైన నీ చరిత్రము నంతయు చెప్పుట కెవ్వనికి సాధ్యమగును? కోర్కెతో నాచే కొంత పల్కించి దాని నంతయు వినదలచితివేమొ? నేను సర్వేశ్వర నామము గలవాడను. ఈ నీ నిర్వాహముకూడ మా అగస్త్యరాజ వంశమును ప్రకాశింపజేయుటకే యను కొందును.

ఉ॥ వేద్యము నీకయో, నెడఁద విప్పి తదంతర భావ రూప సం
పాద్యము లేవొ చూపి, పదబంధములన్ బిగియింప నీవు, నై
వేద్యము చేసితిం గవిత; విజ్ఞులు పద్య గతాంతరార్థ మా
స్వాద్యము సేయు టెట్లనినఁ బల్కఁ నెఱుంగక మౌనమూనుదున్॥152

స్వామీ! అది నీకే తెలియును. హృదయమును తెఱచి, అందు భావ (సంస్కార) రూపమునగల ఆర్జితముల వేనినో చూపి, వానిని పదములనెడి బంధములతో నీవు కట్టివేయగా నే నాకవితనే నీకు సమర్పణ చేసితిని. విశేషముగ తెలిసినవారును తెలియనివారును పద్యముల అంత రార్థము లెట్లు గ్రహింపవలెనో తెలుపు మన్నపుడు తెలియని నేను మౌనము వహింతును.

హృదయమును విప్పుటనగా హృదయగ్రంథిని (ముడిని) విప్పుట. అసలు గ్రంథియన నేమి? దానిని విప్పు టెందులకు? స్వప్రకాశమయి విమర్శశక్తిరూపమయిన బుద్ధిని గ్రసించి, మాయారూపముతో ఆచ్ఛా దించి గ్రహించునది గ్రన్థి. "ధియం స్వప్రకాశ విమర్శ శక్తిం గ్రసతి మాయారూపేణ ఆచ్ఛాద్య గృహ్ణాతీతి గ్రన్థిః". గ్రన్థి భేదన మనగా ముడి విప్పుట. స్థూల సూక్ష్మ కారణశరీరముల మూడిటియందును, అహంభావ మును వదలివేయుటయే. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములుకల సూక్ష్మశరీరమే నేననియు, జీవత్వము నిజమనియు, భావించుట హృదయ గ్రంథి. ఇది అజ్ఞానరూపమయినది. బింబ ప్రతిబింబ ములతో సమానమైన పరమాత్మ జీవాత్మల పరస్పర అధ్యాస (భ్రాంతి) కల్పితమనియు, అది తన నిజరూపము కాదనియు, తెలిసికొనుట-అనగా స్వస్వరూప నిశ్చయజ్ఞానము కల్గుటయే హృదయగ్రంథి భేదనము.

"భిద్యతే హృదయ గ్రన్థిః ఛిద్యంతే సర్వ సంశయాః క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరాపరే జ్ఞాత్వా దేవం పాశ హానిః" -ముణ్డకశృతి.

హృదయగ్రంథి తెగినపుడు పదములతో అవసరము లేకపోయినను, అట్టి భావమునకే నీవు కాళ్ల సంకెల వేసి (పదబంధములతో) కట్టివేసితివి. ఎందుకో? నా కేమి తెలియును! అందుకే మౌనము.

ఉ॥ ఈవును లేఁత నవ్వు లొలికించుచు నిల్తువు, నీ దృగంత సం
ప్లావిత భావ సౌరభము పద్య గుళుచ్ఛములన్ ఫలింపఁ, ద
ద్భావ విలీనతం దవిలి పల్కుల తల్పులు మూసి, చూచెదం
దావక మోహనాకృతి నితాంతము నా హృదయాంతరంబునన్॥ 153

నీవు కూడ చిఱునవ్వు లొలికించుచు నిల్తువు. నీ కడగంటి చూడ్కుల చేత చక్కగా తడుపబడిన భావ పరిమళము, పద్యము లనెడి పూగుత్తు లందు ప్రతిఫలింపగా, ఆ భావములో కలిసిపోయి, పలుకులనెడి తలుపుల మూసివేసి, అత్యంతము నీమనోహరాకృతిని నా హృదయమందే చూచుచు నిల్చిపోదును.

"పుంసాం మోహనరూపాయ" అని, రాముని పురుషులనే మోహింప జేయు అందగానిగా చెప్పుదురు. వాస్తవమునకు పరమాత్మకంటె అంద మయిన వస్తు వేమున్నది? దానిని చూచుటకే కదా మానవుని తపన.

మాటల తలుపుల మూసినపుడే పరబ్రహ్మ తత్త్వము ప్రకటితమగును. "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వమ్" అనియు, "అశబ్దమరూప మఖండమ్" అనియు, ఉపనిషద్వాక్యములు ప్రకటించుచున్నవి కదా!

శా॥ ద్వైతాలంబము నిన్నుఁ దెల్పువఱకే, ధ్వాంతంబుఁ బోఁజేయు న
ద్వైత జ్ఞానము వే వెలుంగులుగ నాంతర్యంబు బాహ్యంబునై
సాతత్యంబును జూపునంతవఱకే, శబ్దం బశబ్దంబుగా
నీ తత్త్వంబున మున్గిపోవు వఱకే, నిల్చుంగదా జ్ఞేయమై॥ 154

ద్వైతమనెడి ఆధారము నిన్ను తెలియజేయు నంతవఱకే, అజ్ఞానాంధకారము నశింపజేయు అద్వైత జ్ఞానముకూడ వేయి వెలుగులతో లోపల వెలుపల వ్యాపించి ఆ శాశ్వతత్త్వమును తెలుపునంతవఱకే, వాక్కు అవాక్కయి నీ తత్త్వమందు మునిగిపోవువఱకే, తెలియదగినవై, తమ అస్తిత్వమును కలిగియుండును కదా!

ఆవల జ్ఞాత జ్ఞాన జ్ఞేయములతో కూడిన త్రిపుటి యుండదు. శబ్ద ముండదు. మనస్సు ఉండదు. చలనముండదు. అదే నిర్గుణ పర బ్రహ్మము. అద్వైతము.

"మాయా మాత్ర మిదంద్వైత మద్వైతం పరమార్థతః
ఇతిబ్రూతేశ్రుతిః సాక్షా త్సుషుప్తావనుభూయతే"–వివేక చూడామణి"

ద్వైతభ్రాంతి మయూ కల్పితమనియు అద్వైతము పరమార్థమైన సత్యమనియు శ్రుతి చెప్పుచున్నది. సుషుప్తియందు వలె జ్ఞానదృష్టి యందును అద్వైతమే చివరకు మిగులు చున్నది.

ఓం తత్సత్

సర్వం శ్రీ సీతారామ పరబ్రహ్మార్పణమస్తు.



'సాహిత్యరత్న' శ్రీ మంచికంటి వేంకటరామకృష్ణ *B.A., (Lit.)*, అద్దంకి

# కవిని గూర్చి-

శ్రీరామసుధాతరంగిణి కావ్యకర్త శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు గారు శ్రీ విద్యోపాసకులు. శ్రీదేవీ ప్రసాదలబ్ధ కావ్యకళాకృషీవలులు. నిరాడంబర జీవనులు. సాధుస్వభావులు. స్నేహ భాజనులు. ఈ కావ్యరచనా సమయమున మాతండ్రి శ్రీ మంచికంటి సీతారామారావుగారికి వీరికి గల స్నేహమును పురస్కరించుకొని, తమ పద్యాలను వినిపిస్తూ చర్చించుచుండటం వలన పద్యములలో వ్యక్తమయిన విశేషాంశాలను- పరమేశ్వర సృష్టి లీలా విభూతులను, ప్రకృతి విలాస విన్యాసాలను, అర్ణవగభీర పరవిద్యా రహస్యాలను- కొంతకు కొంత తెలిసి కొను అవకాశము నాకు లభించింది.

వాల్మీకి రామాయణాన్ని రచింపగా, ఆంధ్రవాల్మీకి క్రొత్తపుంత త్రొక్కి తన రామాయణమునకు వాఖ్యామందరాన్ని రచించి కవులకు మార్గదర్శకుడైనాడు. సర్వేశ్వరరావుగారు జీవుని వేదనా నివేదన రూపమున ఆత్మాశ్రయ రామాయణాన్ని భావించి, వేదాంతభావ సమన్వయము చేసి, రచించి, వాఖ్యానించిన పద్ధతి కూడ వినూత్నమయినదే. ఇట్టి గ్రంథము ఆంధ్రమున నున్నట్లు నేను వినలేదు. ఆధ్యాత్మిక రామాయణమున్నను అందు తత్త్వవిచారము తప్ప, వేదనా నివేదనము లేదు. నివేదనాత్మక గ్రంథములున్నను అవి కేవలము ప్రార్థనా మాత్రము లయినందున కథాభాగము కన్పింపదు. కనుక ఈ కవిగారి ప్రయత్నము అపూర్వము. ఇందుకు వీరిని ఆంధ్రలోకము ఆదరించి ఆశీర్వదిస్తుంది. సామాన్యుడనైన నన్ను శ్రీవిద్యా ప్రాభవమాన్యుడవని, వర్ధిష్ణుడవని అభిమానించెడి గురుతుల్యులు శ్రీరామసుధాతరంగిణి కర్త అయిన సర్వేశ్వరరావుగారిని పాఠకలోకానికి పరిచయం చేయడం నా భాగ్యంగా భావిస్తాను.

అగస్త్యరాజు సర్వేశ్వరరావుగారు 1926 నవంబరు, 29 నెల్లూరు జిల్లా వరికుంటపాడు మండలం (పూర్వం ఉదయగిరి తాలూక) గువ్వాడి గ్రామంలో, బ్రహ్మ విద్యోపాసకులు, జాతీయ ఉద్యమ సారథులలో నొకరైన అగస్త్యరాజు సుబ్బారాయకవి-శేషమ్మలను పుణ్యదంపతుల తృతీయ సంతానముగా, నలువురు పుత్రులలో ద్వితీయుడుగా జన్మించారు. ప్రపితామహుడు సర్వయ్యగారి సంస్మరణార్థం, తల్లిదండ్రులు పేరును ఇంచుక నవ్యీకరించి సర్వేశ్వరరావన్నారు వీరిని.

రావుగారు ఎనిమిదవ యేట శాస్త్రోక్తముగా ఉపనయన సంస్కారాన్ని పొంది, గురుకులానికి పంపబడ్డారు. ఇట్లు సంప్రదాయ జీవితవిధానాన్ని ప్రారంభించినా, 1938సం॥ ఆంగ్ల విద్యాభ్యాసము కొఱకు వీరు నెల్లూరుచేరి వేంకటగిరిరాజా కళాశాలలో బి.ఏ. వరకు చదివారు. మహారాజా కళాశాల, విజయనగరంలో బి.ఎడ్. శిక్షణపొంది, ఉపాధ్యాయ వృత్తిని జీవికగా స్వీకరించారు. అనంతరము, నెల్లూరుజిల్లా పరిషత్ పాఠశాలలలో ఉపాధ్యాయుడుగా, ప్రధానోపాధ్యాయుడుగా పనిచేస్తూ, 1969లో శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి ఉన్నతశ్రేణిలో స్నాతకోత్తర (పోస్టుగ్రాడ్యుయేట్) పట్టాపుచ్చుకున్నారు. తరువాత ప్రభుత్వ కళాశాలలలో అధ్యాపకుడుగా, ప్రధానాధ్యాపకుడుగా పనిచేసి, 1983లో మద్దిపాడు ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణ చేశారు.

వీరి జనకులు అహింసాతత్త్వ విచారము, నిర్వచన భగవద్గీతాయోగము, శివసూత్ర కాశికాసారముల వెలయించిన కవివరేణ్యులు. జ్యేష్ఠ సోదరుడగు వేంకటసుబ్బయ్య చక్కని సాహిత్యాభిమాని. సాహిత్య సౌరభాన్ని వెదజల్లే సాహితీగోష్ఠులు తఱచు వీరియింట వినవస్తూ ఉండెడివి. తత్ఫలితముగా వీరి చిఱుత హృదయములో మొలకెత్తిన కవిత్వాభిరుచికి అన్నగారి ప్రోత్సాహము కూడ లభించుటచేత ఛందస్సున ఓనమాలు నేర్చికొని, నాల్గవఫారం (ఇప్పటి 9వ తరగతి) నుండి పద్య రచనకు శ్రీకారం చుట్టారు. బాల్యంలోనే ప్రముఖ కవయిత్రి కాంచనపల్లి కనకమ్మ, దంటు సుబ్బావధాని, కొప్పరపు సోదరకవుల మున్నగువారి వాత్సల్య దృష్టి, శ్రీ శంకరావధూతలాంటి ఆధ్యాత్మిక సంపన్నుల ఆశీర్వృష్టి వీరిపై ప్రసరించాయి.

ప్రముఖ కవి పండితులు దీపాల పిచ్చయశాస్త్రి, ధరణికోట వేంకట సుబ్బయ్య, ఓలుపాటి విశ్వేశ్వరశాస్త్రి, గుఱ్ఱం సుబ్బరామయ్యగారలు వీరి గురువులు కావటం ఒక విశేషము. వీరు బాల్యంలో మిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు పద్యాలలోనే జరిపెడివారట. బి.ఏ. పూర్తి అగునాటికి వీరు ఉదయగిరి దుర్గము ఖండకావ్యాన్ని వ్రాసి అవధాని పంచానన, కవి సింహ, కవితావతంసాధి బిరుదాంకితులు, శతావధానులు శివభారతకర్తలు అయిన గడియారం వేంకటశేషశాస్త్రిగారి ఆశీస్సుల నందుకోగల్గారు. అప్పు డప్పుడు కొంత గేయరచన కూడ చేసిరి. కాని వీరి ప్రకృతికి సంప్రదాయ ఛందోబద్ధ కవిత్వము నచ్చినంతగా, ఆధునిక గేయ రచన కవితారీతులు నరిపడలేదు. అయినను వీరి కవిత అభ్యుదయ పథానుగామియే.

కవికోకిల దువ్వూరు రామిరెడ్డి, గుఱ్ఱం జాషువా, తిరుపతి వేంకట కవులు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరు వేంకటేశ్వరరావు, రాయప్రోలు సుబ్బారావు, గడియారం వేంకటశేషశాస్త్రి, మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, విశ్వకవి రవీంద్రనాథ టాగూరుల రచనల వలన ప్రభావితులైనారు. నెల్లూరు, ఒంగోలు, వేంకటగిరి, కనిగిరి, ఆముమ సముద్రం, సత్తెనపల్లి, గురజాల, వేటపాలెం, మున్నగు నగరాలలో కవి సమ్మేళనములతోను, సాహితీ సభలలోను, అవధాన సభలలోను పాల్గొని సన్మానింపబడ్డారు. కాని జీవితములో చొరవ (Pushing Nature) లేక పోవటం, స్వీయ రచనల విషయమున అనాసక్తత చూపటం, వ్యక్తిగత సంసారిక సమస్యలు, మారిన అభిరుచులు, మారక బలకొన్న ఆధ్యాత్మిక చింతనము, మున్నగు వానివలన సాహితీ రంగములో అజ్ఞాతకవిరత్న మైనారు. అయినా కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి, డాక్టర్ బెజ వాడ గోపాలరెడ్డి, అయితం కాశీవరప్రసాదరావు, ఆంధ్రవ్యాస యేలూరి పాటి అనంతరామయ్య (అనంతం), సముద్రాల లక్ష్మణయ్య వంటి సహృ దయుల ప్రోత్సాహబలంతో కావ్యకృషిని సాగిస్తూనే ఉన్నారు.

1956లో రవీంద్ర గీతాంజలికి ఆంధ్ర గీతాంజలి అనుపేర చక్కని పద్యాను వాదము చేశారు. అప్పటికి అముద్రితముగా ఉన్న ఆగ్రంథాన్ని విని 1961లో సింహపురి మిత్రమండలి వారు 'కావ్యకళాకృషీవల' బిరుద

ముతో వీరిని గౌరవించారు. 1965 నుండి మిత్రబృందము వీరిని 'మధుర కవి'గా పల్కరిస్తున్నారు. 1978లో అద్దంకి బ్రాహ్మణ సంఘ వేశము వీరిని 'సత్కవి' బిరుదముతో సన్మానించింది.

1965లో ఉదయగిరి దుర్గమును, 1980లో ఓంకారేశ స్తవమును, 1981లో పూచినపూలు ఖండికల సంపుటిని, ఆంధ్రగీతాంజలిని మిత్రుల అభ్యర్థన మేరకు ప్రకటించాడు. కాని వీరు రచించిన గేయముల కూర్పు (భావవీణ) మాత్రము అముద్రితముగా మిగిలిపోయింది. అప్పుడప్పుడు వివిధాంశముల మీద వీరు రచించిన వ్యాసాలలో కొన్ని ముద్రితాలు కొన్ని అముద్రితాలు ఉన్నవి.

నాడు వాల్మీకి శోకమే శ్లోకమై పుణ్యశ్లోకుడయిన శ్రీరాముని చరితమునకు నాందికాగా, నేడు ఈ కవికి నిజజాయా (వైదేహి) వియోగ వేదనమే ఈ శ్రీరామసుధాతరంగిణి ప్రజననమునకు హేతువైనది. ఇందుకు గ్రంథాది పద్యమే సాక్ష్యము. మహర్షి తపసంపన్నుడగుటచే పవిత్రనదీ స్నాతుడై ప్రశాంతుడై రామాయణ రచన కుపక్రమించెను ఈ కవికూడా తానంతకు పూర్వము ఆసేతుహిమాచలము పర్యటించి, తన భావములకు రూపకల్పన చేసికొని, వివిధ సంస్కృతుల మధ్య సమత్వమును, భిన్న సంప్రదాయములలో ఏకత్వమును దర్శింపగల మనః పరిణతిని ఆధ్యాత్మికౌన్నత్యమును పొందియుండుటచే, అవకాశము కలుగగనే శ్రీరామసుధాతరంగిణిని రచించినట్లు తోచుచున్నది.

వీరిపుడు అద్దంకిలో దాదాపు వానప్రస్థ జీవితమును గడపుచు జీవిత పరమార్థాన్ని వెదకుచున్నారు. కావ్యపుత్రికలుగాక వీరికి విద్యా వినయ సంపన్నులయిన ముగ్గురు పుత్రులు, నల్గురు పుత్రికలున్నారు.

ఇట్లు,
బుధవిధేయుడు,
మంచికంటి వేంకటరామకృష్ణ
26-7-86

# సవరణలు

ప్రూఫ్‌లను ఎంత జాగ్రత్తగ చూచినను ముద్రణములో కొన్ని దోసగులు దొర్లినవి. కన్పించినవి సరిదిద్దబడినవి. తక్కినవి సులభగ్రాహ్యములే కానుక సహృదయ పాఠకులకే వదలివేయబడినవి. పాఠకులే వానిని సరిచూసి కొనగలరు.

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| ix | 5 | పౌఢి | ప్రౌఢి |
| x | 2 | వాఖ్య | వ్యాఖ్య |
| మనవి 2వ పేరా | 6 | శాక్త్యాత్మక | శక్త్యాత్మక |
| ,, చివరిపేరా | 4 | దృత | ద్రుత |
| స్మృత్యర్థము | 10 | నిర్గ. న. | నిర్గమనము |
| 3 | 27 | శుతికి | శ్రుతికి |
| 3 | 27 | రీఖై | వైఖరీ |
| 5 | 5 | ఆరుణ | అరుణ |
| 5 | 20 | గొ్ప్వవాడు | గొప్పవాడు |
| 6 | 18 | వ టి | వంటి |
| 8 | 23 | తమోపగూఢ | తమోనిగూఢ |
| 9 | 3 | దంద్వముల | ద్వంద్వముల |
| 11 | 7 | ఉపాథి | ఉపాధి |
| 13 | 6వ కాలం క్రింద | తత్తముల Cafegories | తత్త్వముల Categories |
| 16 | 8 | వక్త్యము | వ్యక్తము |
| 16 | 9 | తెలియడని | తెలియబడని |
| 17 | 2 | పృధివి | పృథివి |
| 19 | 19 | శక్తి | శక్తి |
| 20 | 26 | కాన్తేయ | కౌన్తేయ |
| 21 | 2 | ఆజ్ఞానము | అజ్ఞానము |
| 21 | 26 | విశుద్ధి | విశుద్ధ |
| 22 | 20 | సృష్ఠి | సృష్టి |
| 25 | 20 | అక్షరముఃలు | అక్షరముల |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 28 | 21 | దేనివలన--దగును | ప్రస్తుతజన్మమందనుభవింపబడవలసినకర్మఫలం |
| 31 | 18 | సేన్న | సేకు |
| 31 | 23 | పరివితా | పరిమితా |
| 32 | 11 | నీరథి | నీరధి |
| 32 | 26 | ఆవిద్య | అవిద్య |
| 35 | 18 | భ్రష్టుండ | భ్రష్టుండనై |
| 35 | 10 | విదల్చి | విదిల్చి |
| 37 | 25 | యెఱుంగ | నెఱుంగ |
| 38 | 19 | బడునది | బడునదికాని |
| 43 | 17 | దశాశ్వ | దశాస్య |
| 49 | 1 | విఱచి | విఱిచి |
| 49 | 5 | కదలించి | కదిలించి |
| 50 | 4 | తమచ్ఛటల్ | తమశ్ఛటల్ |
| 50 | 17 | జల్యంబున్ | జ్వల్యంబున్ |
| 52 | 9 | జూచితో | జూచితొ |
| 52 | 15 | స్పందింతు | స్పందితు |
| 56 | 28 | గటకట | హ్గటకట |
| 57 | 3 | బీములు | బీజములు |
| 69 | 22 | దురవస్థం | దురవస్థఁ |
| 72 | 28 | పోవు | ప్రోవు |
| 75 | 2 | దశాషముడు | దశాననుఁడు |
| 80 | 2 | యదార్ధ | యాథార్థ |
| 82 | 21 | సువర్వ | సువర్వ |
| 85 | శీర్షిక | అవబృధము | అవభృథము |
| 85 | 12 | యెఱుంగక | నెఱుంగక |
| 86 | 12 | దైన | నాదైన |
| 93 | 14 | వినూత్న | వినూత్న |
| 94 | 1 | నవంబమ | నవఁబరు |
| 95 | 17 | సమ్మేళనములతో | సమ్మేళనములతో |
| 96 | 6 | ప్రకటించాడు | ప్రకటించారు |